# తులసీదాసు కవితా వైభవం

డాక్టర్ భీమసేన 'నిర్మల్'



# తులసీదాసు కవితావైభవం

తులసీదాసు సాహిత్య సాగరంనుంచి
వెలికితీసిన కొన్ని ముక్తామణులు


వ్యాఖ్యాత

— డాక్టర భీమసేన 'నిర్మల'



ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

THULASIDASU KAVITHAVAIBHAVAM
Collections from THULASI DASU'S
Poetic Works with a Commenetary in Telugu
By Dr. Bhimsen 'Nirmal'


యువభారతి

ప్రచురణ : 42

ప్రథమ ముద్రణ : ప్రతులు 3,200

4 జనవరి, 1976

ముఖచిత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ :

జ్యోతి ప్రెస్, ముషీరాబాదు, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ ;

నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003

లేదా

యువభారతి

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు.

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : రూ. 2-00

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL



# మా మాట

"పోతన్న తెలుగులపుణ్యపేటి" అన్నారు విశ్వనాథవారు. తెలుగు ప్రజలను, తెలుగుభాషను, తెలుగు కవిత్వాన్ని భక్తిభావబంధురంగా మలచింది పోతన్న భాగవతం. హిందీలో తులసీదాసు రామచరితమానస్ (రామాయణం) తెలుగు భాగవతంవలెనే ప్రజలదైనందిన జీవితంతో కలిసి బ్రతుకుతున్నది. తులసీదాసు జీవితం, సమకాలీన ప్రజల కష్టసుఖాలను, ఆదర్శాలకు వ్యంగ్యంగా భంగ్యంతరంగా తన రామాయణంలో చిత్రించాడు. ఆ రచనలన్నీ తన కాలంలోని పామరులు మాట్లాడుకొనే భాషలోనే చేశాడు. సంస్కృతంలో చక్కని వైదుష్యాన్ని కల్గివుండి కూడా ప్రజాబాహుళ్యానికి అనుకూలమైన భాషలో రచన సాగించి తన సరళస్వభావాన్ని ప్రదర్శించాడు. అన్ని భారతీయ భాషల్లోను అనేకానేక రామాయణాలు ఎన్నెన్నో సాహితీ ప్రక్రియల్లోకి ఒదిగి పోయినవి. భారతీయ కవితా తత్వానికీ రామాయణానికీ ఉన్న సంబంధం విడదీయడానికి వీలులేనిది. వాల్మీకి రామాయణం ఒక మహా స్రవంతివలె ఎన్నెన్నో మార్పుల, చేర్పుల సెలయేళ్ళనూ, ప్రక్రియల ఉపనదులనూ కలుపుకొని నిరంతరంగా ప్రవహిస్తున్నది.

తులసీదాసు సాహిత్యంలోంచి కొన్ని సుందరములైన, విజ్ఞానప్రదములైన, భక్తిరసభరితములైన కవితలను ఏరి డా|| భీమ్‌సేన్ 'నిర్మల్' గారు చక్కని తెలుగులో వానికి వ్యాఖ్యానం వ్రాసి యువభారతికి అందించారు. డా|| భీమ్‌సేన్ 'నిర్మల్'గారు తెలుగులోను, హిందీలోను, ఇంగ్లీషులోను అభినివేశం సంపాదించి హిందీవాళ్ళకు తెలుగు సాహిత్య సౌరభాలనూ, తెలుగువాళ్ళకు హిందీ రచనల సొబగును అందించిన ధన్యజీవులు. శ్రీ 'నిర్మల్'గారి ఔదార్యానికి, సౌహార్దానికి, భాషాభిమానానికి మా అభివందనాలు.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమాణాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటే ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 41 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షలయాభై వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీ మిత్ర పథకంలో దాదాపు 3,500 మందికి పైగా సాహితీ మిత్రులుగా చేరారు. రానున్న ఉగాది నాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడింది. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందల మందికి పైగా భారతీ మిత్రులుగా, యాభై మంది భారతీ భూషణులుగా చేరారు. ఈ పథకాలలో సభ్యులుగా చేరి మా "నందిని" మాస పత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యకలాపాల వివరాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

**ఇరివెంటి కృష్ణమూర్తి**
అధ్యక్షుడు

# జంగమస్తులసీతరుః

మన దేశపు మనుగడకు ఆధ్యాత్మిక చింతనయే పట్టుగొమ్మ. నరనరాల్లో జీర్ణించిపోయిన భక్తిభావం మన సాంఘిక జీవనానికి ఊపిరి పోసింది. సాంస్కృతిక రంగంలో మార్గ దర్శకత్వం వహించి, విదేశీయుల వెల్లువ నుండి దేశాన్ని సముద్ధరించి, మరణోన్ముఖమైన జాతీయ జీవనానికి క్రొంగ్రొత్త యావ్వనాన్ని ప్రసాదించింది ఈ ఆధ్యాత్మికతత్త్వమే.

ఈ ఆధ్యాత్మికతత్త్వం ముక్కు మూసుకొని తపస్సు చేసుకోవడానికీ, నియమితంగా ధర్మకర్మలాచరించి, దేవాలయాలకు వెళ్ళి పాపప్రక్షాళనం చేసుకోవడానికీ పరిమితంకాకుండా, జీవన విధానానికే ఒకకరదీపికగా వెలుగొందింది. మతం అన్నది నీతినియమాలు, ఆచార వ్యవహారాలుగా రూపొంది, దైనందిన జీవన విధానంతో సంబంధాన్ని కోల్పోయి సంకుచితంగా మారినప్పుడు, మళ్ళీ సమన్వయ దృక్పథంతో ఆదర్శజీవన విధానాన్ని ప్రతిపాదించిన మహాత్ములు, మహాకవులు మన పుణ్యభూమి మీద అవతరించి సంస్కృతీస్రవంతిని నిరంతరంగా ప్రవాహింపచేస్తూ వచ్చారు. అలా నేతృత్వం వహించిన మనీషులలో గోస్వామి తులసీదాసు ప్రాతఃస్మరణీయుడు. వేయేండ్ల హిందీ వాఙ్మయాకాశంలో అప్రతిమాన ఆదిత్య స్వరూపుడు. సాంస్కృతిక చైతన్యానికి సాంఘిక పునరుజ్జీవనానికి కళాత్మక అభివ్యక్తికి ఆయన అగ్రదూతగా వెలుగొందాడు.

హులసీబాయి, ఆత్మారామ్ దూబేల గర్భపాథోధి మౌక్తికంగా జన్మించిన తులసీదాసు (క్రీ. శ. 1532-1623) చిన్నతనంలోనే తల్లి-తండ్రిని కోల్పోయి ఎన్నెన్నో అగచాట్లకు లోనయినాడు. పుట్టడంతోనే రామనామాన్ని ఉచ్చరించడంచే ఆయనకు 'రామ్‌బోలా' అని పేరు పెట్టారట. ఆ అమ్మా - ఈ అమ్మా పెట్టిన పట్టెడు మెతుకులతో పొట్టనింపుకుంటూ తిరుగుతున్న ఈ బాలుణ్ణి వరాహ క్షేత్రంలో ఉండే బాబా నరహరిదాసు దగ్గరకు తీసి, సమస్త విద్యలు నేర్పించాడు. నరహరిదాసువద్దనే రామకథాసుధారసపానంతో సంతృప్తుడై రామబోలా శేష సనాతుని వద్ద వేద-వేదాంగాలు, సమస్త శాస్త్రాలు నేర్చుకొని దీనబంధు కుమార్తె

అయిన రత్నావళిని పెండ్లాడాడు. ఒక్కరాత్రికూడా పత్నీవియోగాన్ని భరించలేక వరదలోఉన్న నదినిదాటి ప్రహరీ గోడదూకి, భార్యముందు ప్రాలాడు. అప్పుడామె సిగ్గుతో కుంచించుకుపోయి. ఇలా అన్నది:

"అస్థిచర్మమయ దేహ మమ తామే జైసీ ప్రీతి
తైసీ జౌ శ్రీరామ మహఁ హోతి నతో భవభీతి"

(ఎముకల ప్రోవు, తోలుతిత్తికదా ఈ శరీరం. దీని మీద ఉన్నప్రేమే ఆ రామునియందు కలిగితే భవబాధలు లేకుండా పోతాయిగదా !) ఆ వాక్కు ఆయన జీవితంలో అఖండమైన పరివర్తన కలిగించింది, గిరుక్కున వెనుదిరిగి, కాశీ చేరి, సన్యసించి, రామనామ సంకీర్తనంలోనే కాలం గడిపాడు.

ఆరోజుల్లో సాంఘికజీవనం అస్తవ్యస్తంగా ఉండేది. హిందూ ముస్లిముల మధ్య వైషమ్యాలు, వెర్రితలలువేసిన బౌద్ధమత శాఖలు, నిర్గుణ ఈశ్వరారాధనలు వైదేశికమైన సూఫీమత సిద్ధాంత ప్రచారాలు మొదలగువాటితో సమస్త భారత జాతి తుపానులో చిక్కుకొన్న నావవలె అగమ్యంగా కొట్టుమిట్టాతూండేది. ఆ యుగంలో సమన్వయ దృక్పథమే శరణ్యమయింది. హిందీ వాఙ్మయేతిహాసంలో ఈ కాలాన్ని భక్తియుగమంటారు. కబీరుదాసు, నానకు, మొదలగు నిర్గుణ బ్రహ్మ సాధకులు ఒకరకంగానూ, సూఫీ ఫకీరులు ఇంకో రకంగానూ, సమన్వయ సాధనకు ప్రయత్నించారు. కాని ప్రజాసామాన్యానికి అర్థమయేవిధంగా ప్రజలభాషలో జీవితంలో అన్ని రంగాల్లోను సమన్వయాత్మక దృక్పథం, ఆదర్శజీవిత విధానం తన మహత్తరరచన 'మానసం'ద్వారా తులసీదాసు ప్రవంచిచాడు.

ద్రావిడదేశంలో ఉద్భవించిన భక్తిని రామానందుడు ఉత్తరదేశంలో వెల యింప చేశాడు. ఆనాటి పరిస్థితులకనుగుణంగా భక్తిని అలంబనం చేసుకొని, రామ నామ మంత్ర ప్రచారంచేశాడు, సమన్వయాన్ని సాధించాడు. రామానందుని శిష్యకోటికి చెందిన నరహరిదాసుచే రామమంత్ర మహాత్మ్యాన్ని ఆకళింపు చేసుకున్న తులసీదాసు మర్యాదా పురుషోత్తముడయిన రామచంద్రుని పవిత్రగాథను, ఆలా పించి సంఘంలోని ప్రతివ్యక్తికి అనుకూలమైన ఆచరణయోగ్యమైన ఆదర్శాన్ని ప్రతిష్ఠించాడు.సాహిత్య సరస్వతి దేవనదివలె సర్వజనులకు శ్రేయస్సు కలిగించేదిగా ఉండాలనే ఉద్దేశ్యంలో, 'స్వాంతః సుఖాయ'గానే రచించిన 'రామచరితమానస' మహాకావ్యం ఉత్తరభారత దేశ సామాన్య జనజీవన విధానాన్ని తీర్చిదిద్దటంలో

ఎటువంటి అతిశయోక్తిలేదు. అనాటికీ ఈనాటికీ ఉత్తరభారతంలో సామాన్యులు, సమ్మాన్యులూకూడా జీవితంలో అడుగడుగునా రామచరిత్ర మానసంలోని దోహాలను ఉట్టంకిస్తూనే ఉంటారు. ఇంతగా లోకవ్యవహారంలో ప్రతిష్ఠితమైన కావ్యం వేరొకటి లేదనడం సత్యదూరంకాదు.

సమస్త జగత్తును సీతారామమయంగా భావించి, శ్రీరామచంద్రునిలో పరబ్రహ్మను దర్శించిన ఆ మహనీయుడు వర్ణాశ్రమ ధర్మవ్యవస్థను పునఃస్థాపితంచేసి, సంఘ మర్యాదలకు ప్రాణంపోశాడు. కర్మ, జ్ఞాన, భక్తులకు సమన్వయం కల్పించి శైవ-వైష్ణవాలకు అద్వైతం సాధించి, ఆదర్శాన్ని కర్తవ్యం అనే త్రాటిమీద నడిపించి తులసీదాసు హిందూ జాతికి కర్ణధారుడయినాడు. అలనాటి సాహిత్య భాషలయిన వ్రజభాష, అవధీభాషలలోను,మహాకావ్యం ఖండకావ్యం ముక్తకాలు, కీర్తనలు, భజనలు మొదలైన ప్రక్రియలన్నింటిలోను రచనా వ్యాసంగంచేసి, వస్తువులోను, శిల్పంలోను సమన్వయాత్మక దృక్పథాన్ని ప్రదర్శించాడు. అందు చేతనే ఆయన రచనలు అన్ని సంప్రదాయాల వారికి అనుసరణీయాలుగా రూపొందాయి. రామ భక్తిచే ప్రేరితుడయి, నానాపురాణ నిగమాగమ సమ్మతంగాను, లోక సమ్మతంగాను తులసీదాసు రచించిన రామాయణంలోని ఇతర పాత్రల మహోన్నతవ్యక్తిత్వాలు మానవతా మర్యాదలకు హిమాలయోత్తుంగ శృంగాలు.

నిర్వీర్యమైపోతున్న జాతికి జీవంపోసి, ప్రగతిపథంమీద నడవడానికి అవసరమైన ఆత్మశక్తితో సమృద్ధంచేసి, పరబ్రహ్మత్వంలోనే, పూర్ణమానవత్వాని పునాదులు వేసాడు. రామనామం, రాముని జీవిత గాథ ప్రతివాని హృదయంలో నాటుకొపోయేటట్లు చేసాడు. రామునికంటే రామనామమే గొప్పదనీ, కైవల్య ప్రాప్తికంటే రామచరణారవింద చింతనామృతమే వాంఛనీయమనీ, ఉద్ఘోషించాడు రాముని దుష్టశిక్షణ, శిష్టరక్షణ గుణాలను వర్ణిస్తూ, వేణుపాణికంటే. కోదండపాణి రూపమే తనకు ఆరాధ్యమని చాటి చెప్పాడు. సీతాపతి భక్తి-సురగంగా జలంలో తాను ఒక చేపననీ, ఘనశ్యాముని కృపాకటాక్ష సీకరాలకు ధన్యత చెందే చాతకాన్ననీ వేనోళ్ళచాటుకొన్నాడు. రామభక్తి మందాకినిలో సుస్నాతులు కావడంచేతనే జీవితంలో శక్తి,సరసత్వం, పావిత్ర్యం, ఆనందోల్లాసాలు లభిస్తవని ఘంటాపథంగాచెప్పాడు. సీతాపతి సౌశీల్యస్వభావాలను ఆకర్ణించి, మనఃపూర్వకంగా ఆనందించని, ఆనందబాష్పాలతో పులకరింతలు పొందని నరుని జీవితం వ్యర్థమని నిష్కర్షగా తేల్చి చెప్పాడు. సమస్త చరాచర జగత్తును సీతారామమయంగా

భావించి, రామరాజ్యమంటే ఆదర్శ సమాజమనీ, రామభక్తి అంటే సమస్త ప్రాణుల పట్ల ప్రియంకర భావన కలిగి ఉండడమేనని భంగ్యంతరంగా చెప్పాడు. అందుచేతనే పరహితాన్ని చేకూర్చడంకంటే గొప్ప ధర్మంలేదనీ, పరులకు బాధకలిగించడాన్ని మించిన పాపం, రామునిపట్ల ప్రేమికలిగి ఉండి, నీతి పథంలో పయనించాలనీ ఆయన ఉపదేశ సారాంశం.

తులసీదాసు రచనలు 39 అని జనశ్రుతి. నాటిలో రామలలానహాఛూ, రామాజ్ఞాప్రశ్న, వైరాగ్యసందీపినీ, పార్వతీమంగల్, జానకీమంగల్ కవిత్తరామాయణ,బరవై రామాయణ, దోహావళి, కవితావళి, గీతావళి, వినయపత్రిక,రామచరిత మానసం అనే 12 రచనలకు విశేషప్రాముఖ్యం లభించింది. రాముడు అనంతుడు, రామ కథ అనంతమని పదే పదే చెబుతూ, రామకథను ఎన్నిసార్లు వర్ణించినా తృప్తి కలగదంటూ, పై రచనలన్నింటిలోను రామకథను, రామ మహాత్మ్యాన్ని పలు రకాలుగా వర్ణించాడు. ఇవి కాకుండా హనుమాన్ చాలీసా, హనుమాన్ బాహుక్ ఆయన లఘుకృతులు. రామచరిత మానసం అవధీభాషలోను. వినయపత్రిక, కవితావలి మొదలైనవి వ్రజ భాషలోను రచించబడ్డాయి.

ఉత్తర భారతదేశంలో ప్రజలు మతకలహాల వెల్లువలో కొట్టుకోపోకుండా కాపాడి, సమాజానికి సుస్థిర రూపాన్ని కల్పించిన గోస్వామి తులసీదాసు రామ చరిత మానసం రచించి నేటికి 400 ఏండ్లు పూర్తి అయినవి. ఆ సందర్భంలో మానస్ చతుశ్శతి ఉత్సవాలు నిర్వహించి,సమస్త భారత జాతి ఆ మహానుభావునికి శ్రద్ధాంజలులు ఘటించి ధన్యతగాంచింది. తులసీదాసుని కవితావైభవాన్ని తెలుగు పాఠకులకు చవి చూపించమని యువభారతి నన్ను ప్రేరేచింది. ఆ ప్రేరణకు ఫలితం నా యీ చిన్న ప్రయత్నం. స్థలాభావంచేత తులసీదాసుని రచనకు తెలుగు అనువాదం మాత్రమే ఇవ్వడం జరిగింది. ఇందులో తప్పులునావి, ఒప్పులు ఆమహా భక్తునివని సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

తెలుగు పఠితృలోకానికి దిఙ్మాత్రంగానైనా తులసీదాసుని సాహిత్య వ్యక్తిత్వాలను పరిచయం చేయగలిగితే నేను ధన్యుణ్ణే.

— నిర్మల్

# తులసీదాసు కవితావైభవం

## బరవై రామాయణం

(అవధీ భాషకు జాతీయమైన "బరవై" ఛందస్సులో వ్రాసిన ఈ లఘు కృతిలో 69 పద్యాలే ఉన్నాయి. వీటిలో శ్రీరాముడి గుణగణాలు, సీత సౌందర్యం, భక్తి మహత్వం మొదలయిన విషయాలు సరసమధురంగా వర్ణించబడ్డాయి).

చంపక్ హరవా అంగ్ మిలి అధిక్ సోహాయి ।
జానిపరై సియ హియరే జబ్ కుమ్హిలాయి ॥

(సీతాదేవి మేని పసిడికాంతులను ఎంత చక్కగా వ్యంజించాడో చూడండి)

చాంపేయమాల కాంతులు, జానకి శరీరంలో కలిసిపోయి, అపూర్వశోభతో ప్రకాశిస్తున్నవి. ఆమాల వాడిపోయినప్పుడే, ఆమె మెడలో హారం ఉన్నదని తెలుస్తున్నది.

*

ఓ రఘునందనా ! నీఅందచందాలను చూసుకొని మురిసిపోకు. మా సీత నీడలానే నీ రూపం శ్యామలకోమలంగా ఉంది.

సీత సకియలు "నీవు నల్లగా ఉంటావ"ని రాముణ్ణి ఎకసక్కెలాడుతున్నారట.

*

సీత వియోగంతో దుఃఖితుడై రాముడిలా అంటున్నాడు.

హృదయంలో విరహాగ్ని ప్రజ్వరిల్లి నన్ను దహించివేస్తుంటే, నా అశ్రువులు ఆ మంటలను ఆర్పివేస్తున్నవి. ఇలా నా కన్నులు నాకే శత్రువులై దాపురించాయి.

*

జన్మజన్మలకు రామభక్తినే ప్రసాదించమని తులసీదాసు ఇలా వేడుకుంటున్నాడు :

భగవన్నామంపట్ల నాకు విశ్వాసాన్ని కలిగించు. భగవన్నామస్మరణమే నాకు బలం. భగవన్నామానురక్తే నాహృదయం. జన్మజన్మాలకు ఇవేనాకు లభించేట్లుగా అనుగ్రహించు స్వామీ !

నాకేజన్మ లభించినాసరే, ఏశరీరం లభించినాసరే, రామనామమే ఆజన్మకూ, ఆ తనువుకూ సర్వస్వంగా ఉండనీ స్వామీ !

*

## దోహావళి

(దోహావళి తులసీదాసు మరోరచన. ఇది కొంచెం పెద్దదే. ఇందులో 573 దోహాలు ఉన్నాయి. వివిధ సమయాల్లో భక్తి, జ్ఞానం, వైరాగ్యం, సదాచారం, రాజలక్షణాలు, ఇంకా ఎన్నెన్నో అంశాలను గురించి కవితాస్ఫూర్తితో తులసీదాసు ప్రవచించిన దోహాల సముచ్చయమే ఈ గ్రంథం).

జడచేతన్ గునదోషమయ విశ్వకీన్హ కర్తార్ ।
సంత్ హంస గున గహహిం పయ పరిహరి వారి వికార్ ॥

బ్రహ్మ సృష్టిలో చరాచరాలూ ఉన్నవి, గుణదోషాలూ ఉన్నవి. ఈ పరస్పర విరుద్ధ పదార్థాల, విషయాల సమ్మేళనంగానే బ్రహ్మ ఈ జగత్తును సృష్టించాడు. సజ్జనులు హంసలవంటివారు, దోషాలనే జలాలను వదలి గుణాలనే పాలనే వారు స్వీకరిస్తారు.

*

ఉత్తమ మధ్యమ నీచగతి పాహన్ సికతా పాని ।
ప్రీతి పరిచ్ఛా తిహున్ కీ బైర్ బతిక్రమ్ జాని ॥

ఉత్తమ, మధ్యమ, నీచ స్వభావం కల వ్యక్తుల ప్రేమ శిల, సికతా (ఇసుక), జలంవలెను, వైరం దీనికి వ్యతిరేకంగాను ఉంటుందని తెలుసుకోవాలి. అంటే ఉత్తముని ప్రేమరాతిమీది గీతవలె శాశ్వతంగా ఉంటుందనీ, మధ్యముని ప్రేమ ఇసుకమీది గీతవలె తాత్కాలికమైందనీ, నీచుడి ప్రేమ నీటిమీది వ్రాలువంటిదనీ, ఉత్తముడి

మనస్సులో కలిగే వైరభావం నీటిమీది వ్రాలువలెనూ, మధ్యముడివైరం ఇసుకమీది గీత వలెనూ, నీచుడివైరం రాతిమీది గీతవలె ఎల్లకాలం ఉండేదని గ్రహించాలి.

*

ఆ పరాత్పరునిపట్ల మనస్సులో నిజమైన ప్రేమే ఉంటే మన భాషలో చెప్పినా ఒకటే, సంస్కృతంలో చెప్పినా ఒకటే. చలి తట్టుకోవడానికి దుశ్శాలువయే అక్కరలేదు. గొంగళి అయినా సరిపోతుంది.

*

మన పని తీరేవరకు ప్రతి వస్తువూ ఎంతో పవిత్రంగాను, ఎంతో గొప్ప గాను కనిపిస్తుంది. పని తీరిపోగానే, అవి పనికిమాలిన వానిలా కనిపిస్తవి. నోటిలో ఉన్నంత సేపు దంతాలు మౌక్తికాలవలె, ముద్దులు ఒలుకుతూ ఉంటవి. అవే ఊడి క్రింద పడినపుడు, ఎముకల తునకలే కదా !

*

ధనంకానీ, గుణంకానీ, ధర్మంకానీ, బలంకానీ, అధికారంకానీ, ఐశ్వర్యంకాని మరేదైనా కాని ఉంటే ఎవడిలోనైనా గర్వం మొలకెత్తుతుంది. అయితే ఈ గర్వాన్ని వదలుకున్నవాడే త్రిభువన ప్రదీపకుడుగా ప్రకాశిస్తాడు.

*

ఈ కలికాలంలో మోసం, నటన, ఆడంబరం ఎక్కువైపోతున్నవి. ప్రపంచంలో పాపం పెచ్చుపెరిగిపోతున్నది. ఎటుచూసినా, పతితులూ, పామరులే కనువిస్తున్నారు. ఈ విపత్కర పరిస్థితుల్లో మానవుడికి శ్రీరామనామం, పావన గంగాజలం – ఇవి రెండే శరణోపాయాలు.

*

నిజంగా చెప్పాలంటే కలియుగంలాంటి యుగం మరొకటి లేనేలేదని చెప్ప వచ్చు. ఎందుకంటారా ? ఈ యుగంలో కేవలం రామ గుణగణాలను వర్ణించినంత మాత్రాన్నే, మానవుడు సునాయాసంగా భవసాగరాన్ని తరించిపోగలడు.

*

ఇతరులపట్ల ద్రోహం తలపెట్టేవాడు, పర స్త్రీ, పరధన, పరనిందలలో ఆసక్తి కలిగి ఉండే పామరుడు నరరూప రాక్షసుడే.

ప్రపంచంలో ప్రతివాడూ తన మేలు కోరుకుంటాడు. కొంతమంది తమ బంధుమిత్ర వర్గాలవారి మేలూ కోరుకుంటారు. అయితే సమస్త ప్రాణుల మేలుకోరే వాడే నిజంగా సత్పురుషుడు.

*

మోహానికి వశీభూతుడై జీవ సమూహానికి ద్రోహం తలపెట్టే వాడికీ, శ్రీరామ చంద్రునిపట్ల వైముఖ్యం వహించినవానికీ, భోగవిలాసాల్లో తగుల్కొన్న వానికీ, కలలోకూడా భక్తిప్రపత్తులు (దైవసంపదలు), శుభశకునాలు, మనశ్శాంతి లభిస్తాయా ? లభించవనే కవి హృదయం చెబుతున్నది.

*

నాకు కేవలం రాముడి మీదనే నమ్మకం. రాముడే నాబలం, రాముడి అనుగ్రహమే నాకు ఆధారం. ఘనశ్యాముడైన రాముని వాత్సల్యవృష్టికోసం ఎదురు తెన్నులు చూచే చాతక పక్షిని నేను అని తులసీదాసు తన అనన్య భక్తిని కంఠోక్తిగా చాటి చెబుతున్నాడు.

*

అమృతం, సాధువు, కల్పతరువు, పుష్పం, ఫలం, సరసోక్తి, సీతాపతి భక్తి జీవితానికి ఈ ఏడే శుభశకునాలు.

మోహాలకు లోబడి ధర్మకర్మలను వదలివేసిన గృహస్థు;

జ్ఞాన వైరాగ్యాలను వదలివేసి ప్రాపంచిక విషయవలయంలో చిక్కుకొన్న సన్యాసి;

ఈ స్థితిలో ఉన్న ఈ ఇద్దరూ శోచనీయావస్థకు గురిఅయినవారే కదా !

*

శివభక్తుడై నాకు ద్రోహం తలపెట్టేవాడూ, శివద్రోహిఅయి నాకు భక్తుణ్ణను కునేవాడూ, కల్పాంతంవరకు నరకంలో పడి ఉంటాడని రాముని వాక్యంగా తులసీదాసు చెబుతున్నాడు.

*

నీటిని చిలికి నెయ్యి అయినా తీయవచ్చు, ఇసుకలోంచి నూనెనైనా తీయ వచ్చు కాని, హరిభజన చేయకుండా, భవసాగరాన్ని తరించలేమనే సిద్ధాంతానికి తిరుగు లేదు.

హరి గుణగణాలను విని ద్రవించని హృదయం పాషాణం, రామనామాన్ని పొగడని నాలుక కప్పనాలుక.

ఈ దోహా చదువుతూంటే భక్త ప్రవరుడైన పోతన వ్రాసిన పద్యం స్మృతి పథంలో తళుక్కుమంటంలేదా!

*

శ్రీరామచంద్రుని యశోగానం చెవులకు సోకినపుడు, ఆనందాశ్రువులను రాల్చని కన్నులు నాకెందుకు ? అంతకాడికి గుడ్డివాడినై ఉండడమే మేలు.

*

తన సర్వస్వాన్ని ఎవడు సీతారాముల పాదపద్మాలకు అర్పిస్తున్నాడో, అలాంటివాని పాదరక్షలకు తన దేహ చర్మం పనికిరావాలని తులసీదాసు ఆకాంక్ష.

*

ఆపత్కాలంలో మనకు మిత్రుడెవ్వడు? ఓర్పు, ధర్మప్రవర్తన, వివేకం, సత్‌సాహిత్యం, సత్యవ్రతం, శ్రీరామునిపట్ల విశ్వాసం.

*

మంచి మనస్సు, మంచివాళ్ళు, మంచినడత ఉంటేనే రఘురాముడంటే భక్తి కుదురుతుంది. కపటప్రవృత్తి రామునిపట్ల భక్తి ఏర్పడనీయదనీ, కాముడు ఉన్న చోట రాముడు ఉండడనీ తన అనుభవానికి శబ్దాకృతి కలిగించాడు తులసీదాసు.

*

హృదయంలో నిర్గుణ పరబ్రహ్మధ్యానం, నయనాల్లో సగుణస్వరూపం, జిహ్వపై ఆ మధురనామం ఉండాలి. అది స్వర్ణమందసంలో మాణిక్యాన్ని దాచుకున్నట్లే.

*

ఎవడు భక్తుడు ? రామునియెడల ప్రీతి ఉన్నవాడూ, రాగద్వేషాలను జయించినవాడూ, నయమార్గాన్ని అనుసరించేవాడూనూ.

## క వి తా వ ళి

(తులసీదాసు రచించిన ప్రధాన రచనల్లో "కవితావళి" ఒకటి. వ్రజ భాషా ఛందస్సులైన కవిత్త, సవైయ్యాలలో శ్రీరామ చరిత్రను వర్ణించిన పద్యాలే కాకుండా, వివిధ విషయాలను గురించి తులసీదాసు రచించిన పద్యాలు ఇందులో సమకూర్చబడ్డవి. ఇవన్ని ముక్తకాలు. అయినా ఇవి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో రామచింతనామృతాన్నే వర్షిస్తూనే ఉన్నవి. సప్త కాండలుగా విభజింపబడిన ఈ గ్రంథంలో లంకా కాండవరకు రామ చరిత్రకు సంబంధించిన పద్యాలూ, తరవాత ఉత్తర కాండలో భక్తి, జ్ఞానం, వైరాగ్యం, నీతి మొదలయిన అనేక సాంఘిక విషయాలకు సంబంధించిన పద్యాలూ ఉన్నవి. వీటిలో తులసీదాసు తన జీవితగాధను గురించి చెప్పుకున్న పద్యాలుకూడా ఉన్నవి.).

అవధేస్ కే ద్వారేఁ సకారేఁ గయీసుత్ గోద్ కై భూపతి లై నికసే।
అవలోకి హౌఁ సోచ్ విమోచన్ కో ఠగీ-సీ రహీ, జే నఠగే ధిక్ సే॥
తులసీ మనరంజన్ రంజిత అంజన్ నైన్ సుఖంజన్ - జాతక్ సే।
సజనీ ససిమేఁ! సమసీల్ ఉభై నవనీల్ సరోరుహ - వికసే॥

అయోధ్యానివాసిని ఒక సుందరీమణి తన సకియతో ఇలా అంటున్నది :

నేను పొద్దున్నే అయోధ్యాపతి దశరథుని ఇంటికి వెళ్ళాను. అదేవేళకి కుమారుణ్ణి చంకనబెట్టుకొని బయటకి వచ్చాడు ఆమహారాజు. సకలార్తిహరుడైన ఆ బాలకుణ్ణి చూడగానే సంభ్రమాశ్చర్యాలతో నా హృదయం పొంగిపోయింది. ఆ అందాల రాశిని చూచి ముగ్ధుడుకాని వాని బ్రతుకూ ఒక బ్రతుకేనా ? ఎంత అందంగా ఉన్నాయో ఆకన్నులు ! ఆ కాటుక కళ్ళు కాటుక పిట్టల జంటల్లా, చంద్రబింబంలో పూచిన నల్లకలువల్లా ఉన్నాయి.

*

నల్లకలువలా ఉంది మేనికాంతి, తమ్ములనేలే కన్నులవి. ధూళి ధూసరితాంగుడై ఉన్నా అతి సుందరంగా కనిపించే ఆ బాలుని అందం మన్మథుని అతిలోక సౌందర్యాన్ని త్రోసి రాజంటున్నది. చిన్నారి దంతాలు మెరుపు తీగెలు. కిలకిలా నవ్వుతూ తన చిన్నారి, పొన్నారి శైశవ క్రీడలతో మనసులను హరించివేస్తున్నాడు. దశరథుని అనుంగు బాలకులు నిరంతరమూ నా మనోమందిరంలో విలసిల్లుతూ

ఉండాలని నాకోరిక అని తులసీదాసు వారి అపురూప సౌందర్యాన్ని వర్ణిస్తూనే ఆకాంక్షిస్తున్నాడు.

*

వివాహ సమయంలో సీత రాముని సౌందర్యాన్ని చూస్తూ ముగ్ధురాలై పరికించడాన్ని ఎంత చక్కగా వర్ణించాడో చూడండి:

ఆ సుందర హర్మ్యంలో సీతారాములు వధూవరులై ఉన్నారు సుందరీ మణులు పెండ్లి పాటలు పాడుతూ ఉన్నారు. భూసురోత్తములు వేద పఠనం చేస్తున్నారు. ఆ సమయంలో సీత తన చేతి కంకణంలో పొదిగిన వజ్రంలో ప్రతి ఫలించిన రాముని సౌందర్యాన్ని చూస్తూ ముగ్ధురాలయింది. కంకణాన్ని అదే పనిగా చూస్తూ ఆమె పారవశ్యాన్ని చెందింది.

*

అయోధ్యానగరాన్ని విడిచి, తండ్రి ఆనతి ప్రకారం అడవులకు వెళ్ళుతున్న రాముడు బాటసారివలె ఉన్నాడని వర్ణిస్తూ తులసీదాసు ఇలా అంటున్నాడు.

వసంత ఋతువులో రాచిలక కొంగ్రొత్త వన్నెలతో మురిసిపోతున్నట్లు శ్రీరాముడు రాజోచితవస్త్రాభరణాలను వదలివేసి, మునివేషంలో ఎంతో సంతో షిస్తున్నాడు. బాటసారి మార్గంలో ఉండే వృక్షాలను, సహయాత్రికులను సునాయా సంగా వదలి ముందుకు సాగిపోయినట్లు, అయోధ్యను, అయోధ్యావాసులను వదలివేసి రాముడు ముందుకు సాగాడు. తోడునీడగా ఉన్న తమ్ముడు, పునీత సీత–ఈ ఇద్దరూ రూపుదాల్చిన ధర్మకర్మ లన్నట్లున్నారు. ఈ విధంగా కమలనేత్రుడైన శ్రీరామ చంద్రుడు తండ్రి రాజ్యాన్ని పాంథునివలె వదలివేసి అరణ్య మార్గంలో సాగిపోయాడు.

*

తులసీదాసు మనస్సును బాగా ఆకట్టుకొన్న ఘట్టాలలో గుహుని వృత్తాంత మొకటి. పరమాత్ముని పాదప్రక్షాళన చేయడానికి ఎంత గొప్ప నెపాన్ని కల్పించు కున్నాడో గుహుడు చూడండి. గుహుడు రామునితో ఇలా అంటున్నాడు.

ఈ రేవుకు కొద్ది దూరంలో మరో ప్రదేశమున్నది. అక్కడ మొలబంటి నీళ్ళు మాత్రమే ఉన్నవి. పదండి, మిమ్మల్ని అక్కడకు తీసుకువెళతాను. అయితే నా నావమీద మాత్రం కాదు, ఎందుకంటే మీ చరణ ధూళిస్పర్శతో నా నావ అహల్య

వలె లలనగా మారిపోతే, మా ఇంటిదానికి ఏమని సమాధానం చెప్పేది ? నా బ్రతుకు తెరువుకు ఈ నావ తప్ప వేరే ఆధారం లేదాయె. ఈ నావే లేకపోతే నా పిల్లా-జెల్లాను ఎలా పోషించుకునేది? అందుచేత కాళ్ళు కడగకుండా నిన్ను నావమీద ఎక్కించు కునేది మాత్రంలేదు.

*

స్వామీ ! ఈ దోషం మీ చరణాలది కాదయ్యా ! మీ చరణాలనంటి ఉన్న ధూళి మహత్త్వమే అద్వితీయం. ఆ ధూళి స్పర్శ రాతినే నాతిగా మార్చగలిగింది. నా నావను ఉద్ధరించడం దానికో లెక్కలోనిదా ? ఎందుకంటే ఇది కొయ్యతో చేయ బడింది. అదీగాక 24 గంటలూ నీళ్ళలో నానీ-నానీ ఇంకా మెత్తబడి పోయింది. కనుకనే మీ పవిత్ర చరణాలను కడగనివ్వండే, మిమ్ములను నా నావమీద ఎక్క నివ్వను. ఇకమీద మీ ఇష్టం. కేవటుని (గుహుని) ఈ చతురోక్తులు విని శ్రీరామ చంద్రుడు జానకివైపు చూచి కిలకిలా నవ్వాడు, చూశావా ! ఈ గుహుని భక్తి ఎటు వంటిదో అన్నట్లు.

*

జానకి సుకోమల తత్త్వాన్ని, ఆమెపట్ల రామునికిగల అనన్యానురాగాన్ని సరళ సుందరంగా తులసీదాసు ఇలా వర్ణిస్తున్నాడు.

అయోధ్యానగరంనుండి అరణ్యవాసానికి బయలుదేరి,రఘువీరుని ప్రియురాలు ఎంతో ధైర్యంతో, ఎంతో ఓర్పుతో రెండు అడుగులు వేసింది. అంతలోనే ఆవిడ నుదుటిమీద చెమట పట్టింది. పెదవులారిపోయినవి. తన వెనక ఉన్న భర్తను చూచి "ఇంకా ఎంతదూరం నడవాలి ? పర్ణశాల ఎక్కడ నిర్మించబోతున్నారు?" అని అడిగింది. కోమలాంగి అయిన ప్రియురాలి అవస్థను గమనించి ఆ ప్రియుని మనో హర నేత్రాలు ఆర్ద్రాలు అయినవి.

*

సీస్ జటా, ఉరీబాహు బిసాల్, తిర్ ఛీ సీ భౌం హై ।
తూన్ సరాసన్ బాన్ ధరే, తులసీ బన్-మారగ్ మేం సుఠిసోహైం॥
సాదర్ బారహిం బార్ సుభాయ చితై తుమ్ త్యోం
హమరోమన్ మోహైం ।
పూఛతి గ్రామవధూసియసోం 'కహౌసాంవరేసే సఖి రావరే కోహైం॥

అరణ్యమార్గంలో వెడుతూన్న సీతమ్మవారిని చూచి పల్లెపడుచులు ఇలా అడుగుతున్నారు.

జటలతో, విశాలమైన వక్షస్థలంతో, ఉన్నత భుజాస్కంధాలతో, ఎర్ర కలువలవంటి నేత్రాలతో, వక్రసుందరాలైన భ్రూలతలతో, ధనుర్బాణాలు, అమ్ముల పొది ధరించి వనమార్గంలో కన్నులపండుగ చేస్తూ, వలపులొలకబోస్తూ నీవైపు చూస్తూ, మా మనస్సులను దోచుకుంటున్న ఆ నల్లనివాడు నీకేమవుతాడమ్మా ?

తేనెలొలుకుతున్న ఆ పల్లెపడుచుల పలుకులు విని జానకి వాళ్ళు నెర జాణలు అని గ్రహించింది. దాంతో వారివైపు ఓరగా చూసి సైగతోనే వారి ప్రశ్నకు జవాబు చెప్పి, చిరునగవులొలికిస్తూ, ముందుకు సాగిపోయింది. ఆ సమయంలో ధన్యావలోకన పాత్రుడైన శ్రీరామచంద్రుని అదే పనిగా చూస్తున్న గ్రామీణ ప్రమదల నేత్రాలు, సూర్యోదయంతో ప్రేమ సరస్సులో వికసిస్తున్న తామరలను పోలి ఉన్నవి.

*

లోక రక్షణార్థం అవతరించిన రాముని సగుణ-సాకార తత్త్వాన్ని సమర్థిస్తూ తులసీదాసు ఇలా అంటున్నాడు:

అంతర్ జామిహుతేఁ బాహర్ జామిహైఁ రామ్, జేనామ్
లియేతేఁ ।
ధావత్ ధేను పన్హాయి లవాయి జ్యోఁ బాలక్ బోలని కాన్
కియేతేఁ ॥
ఆపని బూఝి కహై తులసీ, కహిబేకీ న బావరి బాత్ బియేతేఁ ।
పైజ్ పరే ప్రహలాదహు కో ప్రగటే ప్రభు పాహన్ తేఁ,
న హియేతేఁ ॥

అంతర్యామి అయిన నిరాకార పరబ్రహ్మకంటే, బహిర్జగత్తులో ప్రత్యక్షంగా కనిపించే సగుణరూపుడైన భగవానుడే అన్ని విధాల గొప్పవాడు. అప్పుడే ఈనిన ఆవు తన దూడ అంభారావం విని పరుగెత్తుకొని వచ్చినట్లు, ఆ సగుణబ్రహ్మ భక్తుని మొరాలించి పరుగెత్తుకుంటూ వస్తాడు. ఇలాంటి భావాలు ఇతరులకు పిచ్చివాని ప్రేలాపనగా అనిపించవచ్చు కానీ తులసీదాసుకు ఇలాంటి భావాలే తోస్తాయి అన్నాడు ఆమహాభక్తుడు. కాని, మహాభక్తుని మాటను అనుసరించి అర్థంవెన్నాడుతుంది. "వాచాం అర్థోనుధావతే" అని కదా ఆర్యోక్తి. మహా విపద్దశ సంభవించినపుడు, భక్తునికి

అగ్ని పరీక్ష ఎదురైనపుడు, శిలా స్తంభంనుంచి ఉద్భవించాడేకాని ఆపరాత్పరుడు చీల్చుకొని బయటపడలేదు కదా !

తులసీదాసు దృష్టిలో శ్రీరాముడు కేవలం దశరథరాముడుకాదు, సీతాపతి మాత్రమేకాదు, రాజాధాముకంతకంటే కాదు. పతితులను ఉద్ధరించడానికి అవతరించిన పతితపావనుడు ఆయన. వేదబాహ్యులు, క్రూరకర్ములు పవిత్ర భారత భూమిలోని దేవాలయాలను నిర్మూలిస్తున్నపుడు, తాము నమ్మిన దేవుళ్ళను, దేవేరులను దోచుకుంటున్నపుడు, పవిత్ర విగ్రహాలను ముక్కలు ముక్కలు చేస్తున్నపుడు, మానినీమణుల శీలాలను అపహరిస్తున్నపుడు, ఆ పిశాచ నృత్యాలను నిస్సహాయంగా చూస్తున్న తులసీదాసుల కెందరికో రాముడు పతితపావనుడుగానే, కోదండరాముడుగానే, ఆర్తత్రాణ పరాయణుడుగానే కనిపించాడు. అందుకనే తులసీదాసు హిరణ్యకశిపునివంటి కలికాలానికి రామనామం నరకేసరి (నృసింహమూర్తి) వంటిదని అన్నాడు.

మళ్ళీ దేవుడవతారమెందుకెత్తడు ? లేగలవంటి భారతీయుల అంభారావాన్ని ఎందుకు వినడు ? ఎందుకునిర్గుణుడయ్యాడు ? ఆ నిర్గుణ బ్రహ్మకంటే పాషండుల తలలను ఉత్తరించగలిగిన సుగుణావతారుడు, ధర్మసంరక్షకుడు ఏల రాడు ? అని నాటి భారతీయుల హాహాకారాలను భంగ్యంతరంగా, వ్యంగ్యగర్భితంగా తులసీదాసు ఈ పంక్తుల్లో సాక్షాత్కరింపచేస్తున్నాడు.

## గీ తా వ ళి

(రామచరిత మానసం తరవాత పరిమాణంలో చిన్నది అయినా చెప్పుకోతగ్గది "గీతావళి". ఇందులో 328 కీర్తనలు ఉన్నవి. తెలుగులో వలెనే హిందీలో పద సాహిత్యం ప్రజాబాహుళ్యాన్ని ఉర్రూతలూగించింది. సూరదాసు, మీరాబాయి లాంటి వాగ్గేయకారులు కీర్తనలను పదాలను గానంచేసి, నాదబ్రహ్మను ఉపాసించారు, మన త్యాగరాజు వలెనే. తులసీదాసూ మహాకావ్య, ఖండకావ్యాలతోపాటు పదాలను, కీర్తనలను వ్రాసి, భగవన్నామస్మరణ చేసే భక్తులకు, హరిదాసులకు సన్నిహితుడయ్యాడు. హిందీలోని పదసాహిత్యనికి, పదకవితకు తులసీదాసు గీతావళి దీపావళి.

ఈ రచనలో కవి తన ఆరాధ్యదైవమైన శ్రీరాముని రూప మాధుర్యాన్ని వర్ణించడంలోనే ముగ్ధుడయినాడు. రాముని బాల్యక్రీడలు, రాముని కిశోర, తాపస, రాజవేషాదుల వర్ణనలతో కవి హృదయం ఆనందోత్సాహాలతో ఊయలలూగింది.

భరతరామసమాగమం, జటాయువు సంరక్షణ, శబరికి మోక్షప్రదానం, విభీషణ శరణాగతి, సీతావిరహం మొదలయిన ఘట్టాల్లో కవి హృదయం పులకరించింది. పుత్రవియోగంతో దురపిల్లిన తల్లి శోకాన్ని ఎంతో హృదయ విదారకంగా చిత్రించాడు. మానస్‌లో కౌసల్య శోకాన్ని వర్ణించనే లేదు. ఆ లోపాన్ని గీతావళిలో పూరించాడేమో తులసీదాసు. (ప్రబంధ కావ్యంలో ఉండే నియమనిబంధనలు లేక పోవడంతో, తులసీదాసు వివిధ విషయాలను ఉన్మత్తంగా, హృద్యంగాను వర్ణించాడు).

*

"ఆంగన్ ఫిరత్ ఘుటురువని ధాయే
నీలజలద్ తను స్యామ్‌రామ్ సిసు జనని నిరఖి ముఖ్
నికట్ బోలాయే"

రఘురాముడు రాజసౌధ ప్రాంగణంలో దోగాడుతున్నాడు. నీలజలదాన్ని పోలిన తనువుతో నిగనిగలాడుతున్న ఆశిశువుని చూచి దగ్గరకు పిలిచిందితల్లి. మంకెన పువ్వుల్లా ఎర్రనెర్రని అరికాళ్ళల్లో అంకుశాది చక్రవర్తి లక్షణాలు కనిపిస్తున్నవి. చరణ మంజీరాలు పక్షుల గూళ్ళవలె ఉన్నవి. ఆ గూళ్ళల్లో మౌని కల హంసలకు ఆయన చిరనివాసం కల్పించినట్లున్నది. ఆ ప్రభువుమొలకు మొలత్రాడు, శంఖ సదృశమైన కంఠానికి హారాలు, సుందర భుజాలకు ఆభరణాలు ఆలంకరించారు. వక్షస్థలం మీద (శ్రీ)వత్స చిహ్నమూ, పులిగోళ్ళు, మణిఖచిత పదకమూ శోభిల్లుతున్నవి. ప్రభువు చిబుకమూ, దంతపంక్తులూ, అధరపుటాలూ, నాసిక, కర్ణాలూ, కపోలాలూ అన్నీ నాకు ఎంతో ప్రియంకరమైనవి. భగవానుడి మనోహరమైన భ్రూలతలు కరుణారస ప్రపూర్ణాలు. కన్నులు తమ్ములు బోలినవి. విశాలలలాట ఫలకం పై ముంగురులు పొరాడుతున్నవి. బాల్యావస్థకు తగిన కేశకలాపం ఎంతో శోభాయమానంగా ఉంది. ఇద్దరు గురువులను (బృహస్పతి, శుక్రుడు), శని, మంగళ. గ్రహాలను ముందుంచు కొని, అంధకార సమూహం చంద్రుణ్ణి ఎదుర్కోవడానికి వచ్చినట్లుగా ఉన్నది హరి ముఖ సౌందర్యం. (కవి ముంగురులలో ఉన్న స్వర్ణాన్ని బృహస్పతితోను, వజ్రాన్ని శుక్రుడితోను, నీలమణిని శనిగ్రహంతోను, పద్మరాగమణులను మంగళ గ్రహంతోను, కేశకలాపాన్ని అంధకారంతోను, ముఖాన్ని చంద్రునితోను పోల్చాడు). ఆ ప్రభువును తల్లి కౌసల్య పీతాంబరాలంకృతుని చేసినపుడు నాకొక అద్భుతమైన ఉపమా లంకారం స్ఫురిస్తున్నదంటాడు తులసీదాసు. నీలాకాశంపై, నక్షత్ర సమూహాలు దేదీప్యమానంగా కనబడుతుంటే. మెరుపుతీగె తన చంచల స్వభావాన్ని వదలి, నీలాకాశాన్ని, నక్షత్ర సమూహాన్ని అవరించుకొని ఉన్నట్లున్నది. (మేఘశ్యాముని

శరీరంపై ఆభరణాలు నక్షత్రాల వలెనూ, పీతాంబరం మెరుపు తీగెవలెనూ ఉన్నదట.) భగవంతుని ప్రతి అవయవం అనంతకోటి మన్మధుల అందాలను సంతరించు కున్నట్లుగా ఉన్నది. అయితే ఒక మాట. బ్రహ్మ సృష్టిలోని రూపాన్నీ, గుణాన్ని అయితే వర్ణించవచ్చునేమో కాని, సాక్షాత్తు భగవత్స్వరూపాన్ని ఎలా వర్ణించేది? అది అసంభవం కదా!

ఈ గేయంలో తులసీదాసు తన మనోముకురంలో దర్శించిన భగవంతుని శిశురూప సౌందర్యాన్ని, ఆ అపరూప సౌందర్యాన్ని అతి మనోజ్ఞంగా చిత్రించాడు.

*

రామపద పదుమ-పరాగ్ పరీ ।
ఋషితియ తురత్ త్యాగి పాహన్-తను ఛవిమయ దేహ ధరీ॥

శ్రీరాముడు అహల్యను ఉద్ధరించిన ఘట్టాన్ని ఈ గేయంలో తులసీదాసు వర్ణిస్తున్నాడు.

శ్రీరామ పాద పద్మాల పరాగంతో ఋషిపత్ని అహల్య రాతిరూపాన్ని వదలి నాతిగా మారింది. ఘోర పాపంవల్ల కలిగిన పతిశాపానలంతో దహించుకొపోతున్న కల్పలత, మేఘశ్యాముని కృపాసుధా-ధారా-ప్లావితమయి మళ్ళీ పల్లవించింది, పుష్పించింది, ఫలించింది. అలా పాషాణరూపం పోయి, అహల్య మనోహరాకారాన్ని పొందింది. వేదాలకందని శ్రీరామ మంగళ స్వరూపాన్ని శివ-బుద్ధి-యువతి వరించింది. తన దృష్టిపథంలో తారసిల్లిన అట్టి దివ్య మంగళ విగ్రహాన్ని అహల్య తదేక నిష్ఠతో చూడసాగింది, ప్రేమానందోత్సాహాలతో కూడినదై మనస్సులోనే ఆయన రూపాన్ని, శీలాన్ని, గుణాన్ని నుతించ సాగింది. ఇలా శోకతప్తులైన వారి నెందరిని ఆ ప్రభువు సమాశ్వాసింప చేశాడో, తరింపచేశాడోనని అంటున్నాడు తులసీదాసు.

*

ఒక సఖి సీతారాముల సౌందర్యాన్ని తన సఖితో ఇలా వర్ణించి చెబుతున్నది:

ఓ సఖీ! ఓ సుముఖీ! కన్నులున్నందుకు లాభాన్ని పొందు. శ్యామసుందరుణ్ణి సాదరంగా అవలోకించు. శివధనుస్సు భంజించి మనకు సాక్షాత్కరించిన ఆ అజాను బాహుణ్ణి చూడు. గళసీమలో జయమాలా సుశోభితుడై, సమస్త జనులకు ఆనందం

కలిగిస్తున్నాడాయన. నఖశిఖ పర్యంతం శరీరమంతా అపురూప సౌందర్యంతో మిల మిల లాడిపోతున్నది. హృదయ పూర్వకమైన ప్రేమతో ఆ స్వరూపాన్ని వీక్షించు. చూచి, నీ అదృష్టాన్నీ, సీతారాముల రూప సౌందర్యాన్ని అసౌందర్యాన్ని సృష్టించిన విధాత నైపుణ్యాన్ని నుతించు. సమరంలో రాహువును సంహరించి, తన కళంకాన్ని బాపుకొన్న చంద్రునివలె, ఆయన ప్రసన్నసుందర ముఖమండలం శోభాయుక్తంగానూ, ఉత్సాహయుక్తంగానూ ఉన్నది. అందాలకు తావులయిన ఆ కన్నులు కమలాల చక్కదనాన్ని వెక్కిరిస్తున్నట్లున్నవి. ఇలాంటి కమనీయ సుందర రూపంతో, జానకీ పతి శ్రీరాముడు తన హృదయమందిరంలో సుప్రతిష్ఠితుడయి విరాజిల్లుతున్నాడని తులసీదాసు వక్కాణిస్తున్నాడు.

*

సీతారాముల దివ్య సౌందర్యాన్ని ఎన్నిసార్లు వర్ణించినా తులసీదాసుకు సంతృప్తి కలుగదు. ఈ పదంలో మళ్ళీ వారి రూప సౌందర్యాన్ని వర్ణిస్తున్నాడు.

పెండ్లి పందిట్లో వధూవరులు సీతారాములు మెరుపుతీగె, మేఘంవలె శోభిస్తున్నారు. (మహాకవి పోతనామాత్యునికీ రామభద్రుడు ఈ విధంగానే 'మెరుగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగట నుండ నొప్పువాడు' సాక్షాత్కరించాడు), నఖశిఖ పర్యంతం వారి సౌందర్యం హృదయాన్ని హరించేట్లుగా ఉన్నది. వివాహోచిత వస్త్రాభరణాలతో అలంకృతులయిన వారిని చూచి సఖులు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోతున్నారు. నిజానికి బ్రతికి ఉన్నందుకూ, కన్నులు ఉన్నందుకూ వారికి ఈనాడు సమస్త సౌభాగ్యాలు సంపూర్ణంగా లభించినవి. మదనుడు గోపాలుడు. శోభ సురభి. శృంగారం క్షీరం. అమృతం పెరుగు. ఆ పెరుగును మథించి తీసిన నవనీతంతో ఆయన సీతారాముల స్వరూపాలను నిర్మించాడేమో! లోకంలో ఉన్న సౌందర్యమంతా అటు తరవాత మిగిలిపోయిన మజ్జిగలాంటిది. ఆ జంటను చూస్తూఉంటే అమిత ఆనందం కలుగుతున్నది. ఆ శోభ వర్ణనాతీతం. బ్రహ్మ సౌందర్యాన్ని రాశిగా పోశాడు. ఆ రాశి సీతారాముల స్వరూపం దాల్చింది. రాశిలోనికి చేరలేని ఒకటి అరా శన్యదాకలాలు రతీ మన్మథులుగా రూపుదిద్దుకున్న వట. అనగా సీతారాముల సౌందర్యం ముందు రతీ మన్మథుల సౌందర్యం అంత తుచ్ఛమైనదని తులసీదాసు భావం. ఆది దంపతుల దివ్య సౌందర్యాన్ని ఎంత మంగళంగా చిత్రించాడో చూడండి ఆ మహాకవి.

పాదుకలు శిరస్సున ధరించి, అయోధ్యకు వెడుతూ, చేతులు జోడించి, భరతుడు రామునితో ఇలా విన్నవించు కుంటున్నాడు.

ఓ దీనబంధూ! ఈ దీనుడి దైన్యాన్ని మరచిపోయేరు సుమా! స్వామీ! నాకు మీలాంటి ప్రభువు మరొకరు లేరు. కాని నాలాంటి సేవకులు మీకు వేనవేలు. నా గుండెలోగూడు కట్టుకొన్న అచ్చమైన ప్రేమను గుర్తించి, నా దోసగులను మన్నించి. నన్నేలుకోస్వామీ! ఇలా విన్నవించుకొని, సీతారాముల చరణాలకు ప్రణమిల్లి, లక్ష్మణుణ్ని, కౌగలించుకొని, భరతుడు ప్రతిజ్ఞ పూనుతూ ఇలా అన్నాడు. వనవాసం గడువు తీరిన మరుసటి దినం మీరు అయోధ్యలో అడుగు పెట్టకపోయారో, ఈ దాసుణ్ణి ప్రాణాలతో చూడలేరు. మీ చరణకమలాలపై ఒట్టు పెట్టుకొని చెబుతున్నాను సుమా!

*

అనన్య భక్తి ప్రభావాన్ని, పరాత్పరుని భక్తివాత్సల్యాన్ని నుతిస్తూ, తులసీదాసు ఇలా అంటున్నాడు.

ధనికుడు కానీ, పేదవాడుగాని, పెద్దకానీ, పిన్నకాని, బుద్ధిమంతుడు కానీ, మూర్ఖుడుకాని, అతిబలుడుకానీ, అబలుడుకాని - ఎవడికైనా శ్రీరామ చరణాలే శరణోపాయాలు. కుంటి, గుడ్డి, గుణహీనుడు, దరిద్రుడు, తాగడానికి పుడిసెడు నీళ్ళుకూడా లభించని హీనుడు-ఎవడైనా సరే, రామభక్తి రాజమార్గాన్ని అనుసరిస్తే చాలు, ఆ రాముడే వాడిని రక్షిస్తాడు. రామ నామ ప్రతాపదివాకరుని ప్రచండ తాపానికి కలికల్మష తుషారం నిమిషంలో పటాపంచలయి పోతుంది; పుత్రుణ్ణి పిలుస్తున్నానను కుంటూనే, భగవన్నామాన్ని స్మరించి, అజామిళుడనే దుష్టుడుకూడా భవసాగరాన్ని సునాయసంగా తరించాడు. ప్రభు చరణాలకు ప్రేమ పూర్వకంగా చేసిన విభీషణ ప్రణామ కల్పభూరుహం క్షణంలోనే పుష్పించింది. కనుకనే రామ నామధ్యాన నిరతులకు, నింగిలోఉన్నా, నీటిలో ఉన్నా, నేలమీద ఉన్నా-శుభ పరంపరలే సంప్రాప్తిస్తాయని తులసీదాసు వక్కాణిస్తున్నాడు

## వినయపత్రిక

(కలి పురుషుని రాజ్యంలో నానాయాతనలుపడి, ఆ బాధలను భరించలేక శ్రీరామచంద్ర ప్రభువుల సముఖానికి తులసీదాసు సమర్పించుకున్న మహజరే

("వినయపత్రిక". తాపత్రయ సంతప్తుడైన జీవుడు పరమాత్ముని ముందు తన గోడు వెళ్ళబోసుకోవడమే దీని సారాంశం. ఆనాటి రాచదర్బారుల విధానాన్ని కండ్లకు కట్టిస్తూ, సర్వదేవతలను ప్రసన్నులను చేసుకొని, తన కేసు రికమెండు చేయమని వారిని ప్రార్థించి, తులసీదాసు చివరకు రామచంద్రుల వారి అనుగ్రహాన్ని సంపాదిస్తాడు. గణేశవందనతో ప్రారంభించి, భాస్కర, శంకర, గిరిజా, గంగా, యమునా, కాశీ, చిత్రకూట, ఆంజనేయ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నాదులను నుతించి,చివరకు జగన్మాత సీతనూ అర్థించి, కృతకృత్యుడవుతాడు తులసీదాసు, ఇలా 68 కీర్తనల తరవాత అసలు వినయ పత్రిక ప్రారంభమవుతుంది. అందులో కవి తన దైన్యాన్నీ, తన పాపభూయిష్ఠ జీవన విధానాన్నీ, పరమాత్ముని భక్తి వాత్సల్యాన్నీ పలు విధాలుగా వర్ణిస్తాడు. ఈకీర్తనలలో కొన్ని భద్రాచలరామదాసు కీర్తనలను తలపింప చేస్తవి. హిందీ పద సాహిత్యంలో "వినయ పత్రిక" తల మానికం వంటిది).

ఐసీ మూఢతా యా మన్ కీ ।

పరిహరి రామభగతి-సురసరితా ఆస్ కరత్ ఓస్ కన్ కీ ॥

ఈ మనస్సు మూఢత్వాన్ని, అజ్ఞానాన్ని గురించి విచారిస్తూ తులసీదాసు ఇలా అంటున్నాడు.

ఈ మనస్సు రామ భక్తి అనే దేవనదిని పరిత్యజించి, దాహం తీరడంకోసం మంచుబిందువుల్ని ఆశిస్తున్నది. చాతక పక్షిలాంటి ఈ మనస్సు ధూమ సమూహాన్ని తిలకించి, మేఘ సమూహమని భ్రమపడి ఆనందపడుతున్నది. నీరుకాని, శీతలత్వం కాని లేని ఆ ధూమసమూహం వల్ల కండ్లకు హాని కలుగుతుంది కాని ఎలాంటి లాభం కలుగదు కదా ! గాజుతో నిర్మించిన నేలమీద తన ప్రతిబింబం కనబడగానే గద్ద ఒక్క ఉదటున విరుచుకుపడుతుంది. దాంతో ముక్కు విరగడం తప్ప ఆ గద్దకు ఏం లభిస్తుంది ? ఓకృపానిధీ ! రఘురామా ! ఈ మనస్సు దుష్టప్రవర్తనను గురించి ఏమని వర్ణించేది ? ఈ విషయం నీకు తెలియంది కాదుకదా ! కనుక సర్వభూతాలకు అభయప్రదానం చేస్తానన్న ప్రతిజ్ఞను, శరణాగత రక్షణను గుర్తుంచుకొని ఈ దుస్సహ దుఃఖాన్నుండి నన్ను రక్షించు స్వామీ !

*

కృపానిధానుడైన రాముడికీ, తనకూగల సంబంధ బాంధవ్యాలను వివరిస్తూ తులసీదాసు ఇలా అంటున్నాడు.

తూ దయాలు దన్ హౌ(ం తూదాని, హౌ(ం భిఖారీ ।
హౌ(ం ప్రసిద్ధ పాతకీ. తూ పాపపుంజహారీ ॥

నీవు దయాళుడివి, నేనేమోదీనుణ్ణి. నీవు దాతవు, నేను యాచకుణ్ణి, నేను పరమపాతకిని. నీవేమో పాపాలను పటాపంచలు చేసేవాడివి. నీవు అనాథ నాథుడివి. నాలాంటి అనాథుడింకెవడయినా ఉన్నాడా! నాలాంటి దుఃఖితుడూలేడు, నీలాంటి దుఃఖహరుడూలేడు. నీవు బ్రహ్మవి, నేను జీవుణ్ణి. నీవు యజమానివి నేను దాసుణ్ణి. నీవే నాకు తండ్రివి, తల్లివి, గురువువి, సఖుడివి, అన్ని విధాల నాకు మేలు సమకూర్చేవాడివి నీవే. నీకూనాకూ మధ్య ఎన్నో రకాల సంబంధ బాంధవ్యాలు ఉన్నాయి. నీ ఇష్టంవచ్చిన విధంగా ఈ తులసీదాసుకు నీ చరణాల్లో ఆశ్రయం లభించేట్టు చేయిస్వామీ! నాకు మరేకోరిక లేదు.

*

ఓ కేశవా! నీ సృష్టిని ఏమని, ఎలా వర్ణించేదయ్యా? అతి విచిత్రంగా కనిపించే నీ సృష్టిని గురించి మనస్సులో ఎంత గంభీరంగా ఆలోచించినా పైకి ఏమి వర్ణించలేకపోతున్నాను. ఆధారం లేదు, కాని చిత్రం కనిపిస్తున్నది. ఆ చిత్రంలో రంగులూ లేవు. శరీరం లేకుండానే చిత్రకారుడు ఈ చిత్రాన్ని రచించాడు, కడిగినా చెరిగిపోదు ఈ చిత్రం. కాని ఈ చిత్రాలను చూచి భ్రమసి మనస్సు తహతహలాడి పోతున్నది. ఈ విచిత్ర సృష్టి మృగతృష్ణలాంటిది. అందులో నీ మాయామకరం ఉంది. తన దగ్గరకు వచ్చే చరా చరప్రాణుల్ని ఆ మకరం మింగేస్తున్నది. కాని అదేమి చిత్రమో మరి, ఆ మకరానికి నోరే లేదు.

ఈ సృష్టిని కొంతమంది సత్యమనీ, కొంతమంది అసత్యమనీ, కొంతమంది అదే-ఇదీ అని అంటున్నారు. ఈ మూడూ భ్రమలే, ఈ భ్రమలని తొలగ ద్రోచి, నిన్నూ-నన్నూ గుర్తించే శక్తిని ప్రసాదించమని తులసీదాసు ఆ పరాత్పరుణ్ణి వేడుకొంటున్నాడు.

*

భగవదాశ్రయం లభించినందువల్ల కలిగే అనన్యప్రభావాన్ని ఉట్టంకిస్తూ తులసీదాసు ఇలా అంటున్నాడు!

నాకు రామనామం పట్లనే ఘట్టి నమ్మకం. ఎందుచేతనో చెప్పలేను కాని, వక్రస్వభావం కల నా మనస్సు ఏ ఇతర విషయాల్లపట్ల మొగ్గు చూపడం లేదు. నాకు

షట్ శాస్త్రాలూ రావు. నాలుగు వేదాల్లో ఒక దాంట్లోకూడా ప్రవేశమూలేదు. వ్రతాలు, తీర్థయాత్రలు, జపతపాల మూలాన శరీరం క్షీణించిపోతున్నదని నా మనస్సు భయపడి పోతున్నది. కలియుగంలో కర్మకాండ కఠిన సాధ్యమైంది కూడా. ఇంకా జ్ఞాన, వైరాగ్య, యోగ, జపతపాలను చక్కగా నిర్వర్తించాలంటే కామక్రోధ,లోభ మోహాదులు ఎన్నోరకాల అడ్డంకులను సృష్టించి, పతనానికి దారి తీస్తవి. అందుచేత ఇవన్నీ ఆలోచించి చూస్తే ఆ శ్రీరామచంద్రుని గుణగణాలను కీర్తిస్తూ, నిత్యమూ నామ స్మరణ చేస్తూ ఉండేవారే సర్వదా యోగ్యులని చెప్పాలి. వారే సర్వగుణ సంపన్నులు వారికి ఎట్టి విఘ్నాలూ ఉండవు. రామనామ కల్పవృక్షఛ్ఛాయలలో ఆశ్రయంపొందిన వారికి ఘనఘనాలవల్లా, ప్రచండతాపంవల్లా ఎటువంటి భయమూఉండబోదు. వారిని ప్రాపంచిక విషయాలు కానీ, పాప పటాలం కానీ బాధపెట్టలేవు. చచ్చిన తరవాత నరకానికి పోతానో, స్వర్గానికి పోతానో తెలియదు కాని నాకు ఇహలోకంలో రామ దాసుణ్ణయి బ్రతకడమే అన్నిటికంటే ఉత్తమమని తోస్తున్నది.

*

తరుణం చేజారిపోయిన తరవాత పశ్చాత్తాపపడి లాభం లేదని, తన మనస్సును ప్రబోధిస్తూ తులసీదాసు ఇలా అంటున్నాడు.

అవకాశం చేజారిపోయిం తరవాత పశ్చాత్తాపపడి లాభంలేదు. ఓ మనసా ! దుర్లభమయిన మానవశరీరం లభించింది కనుక త్రికరణశుద్ధిగా ఆ హరిని భజించు సహస్ర బాహువులు కల కార్తవీర్యార్జునుడూ, దశకంధరుడయిన రావణుడూ కూడా కాలపురుషునికి బలి కాక తీరలేదు. నేనూ, నా వారూ అంటూ మమకారంతో దబ్బూ-దస్కం కూడబెట్టినవారు, చివరకు అంతా ఇక్కడే వదిలేసి వెళ్ళిపోక తప్పలేదు. వెళుతూ వెళుతూ పూచికపుల్లకూడా తీసుకొనిపోలేకపోయారు. భార్యా బిడ్డలు స్వార్థ పరులై నిన్ను ప్రేమిస్తున్నారే తప్ప నీ వెంట వచ్చినవారూ కాదు, నీ వెంట వచ్చే వారూ కాదు. ఓ పామరుడా ! చివరకు ఎలాగో అందరూ నిన్ను వదలివేసేవారే కదా ! అలాంటప్పుడు నీవే వారిని వదలివేస్తే ఎంత బాగుంటుంది? మూర్ఖుడా ! అవిద్య (మోహం) అనే నిద్రనుంచి మేల్కొని ఆ శ్రీరామస్వామిని ఆశ్రయించి, ప్రాపంచిక లాలసలకూ, విషయ వాసనలకూ తిలోదకాలు ఇచ్చేయి. కామరూప మయిన అగ్ని విషయవాసనా రూపమయిన ఘృతంచే ఇంకా ప్రజ్వరిల్లుతుంది

(కామోపభోగాలవల్ల కామం శమించదు). కాని నశించదు. అందుచేత వాటిని పూర్తిగా వదిలేసి శ్రీరామ చరణాల శరణు పొందడమే ఉత్తమం.

*

అబ్ లౌ᳚ నసానీ అబ్ న నసైహౌ. ।
రామకృపా భవనిసా సిరానీ జాగే ఫిర్ న డసైహౌ.॥

ఇంతకాలం నా జీవితం దుష్టమార్గాలననుసరించి భ్రష్టమయిపోయింది. కాని ఇహ ముందు ఇలాజరగనివ్వను. శ్రీ రఘునాథుని కృపా కటాక్షంచే సంసారయాతనా స్వప్నం గడిచిపోయింది. ఇకమీద మాయా । శయ్యమీద నిద్రించే ప్రసక్తే లేదు. ఇప్పుడు నాకు సునాయాసంగా రామనామ చింతామణి లభించింది. దాన్ని భద్రంగా హృదయంలో పదిలపరచుకోగలను. రఘునాథుని పవిత్ర శ్యామలరూపమనే గీటురాయి మీద నా హృదయమనే సువర్ణాన్ని పరీక్షించి చూడగలను. విరక్తి, ఆత్మపరీక్షణ అనే అగ్నిలో మనస్సువర్ణాన్ని కరిగించి, కుందనంవలెచేసి, రఘునాధుని నామస్మరణ లో లగ్నం చేయగలను. నేను మనస్సుకు దాసుణ్ణయి ఉన్నంతవరకు, పంచేంద్రియాలు నన్ను ఆటపట్టించినవి. కాని ఇహముందు వాటిని నావశంలోఉంచుకొని నన్ను ఉపహసించకుండా. వాటి అట కట్టించగలను! ఇతర పుష్పాలను ఆశించకుండా భ్రమరం కమల కోశాన్ని ఆశ్రయించినట్లు, నేను నా మానసేందిందిరను శ్రీరామ చరణారవిందాల్లో బందీగా చేసివేస్తాను.

తులసీదాసుని అనన్యభక్తి భావనకు ఈ కీర్తన ఉత్కృష్ట నిదర్శనం.

నౌకమీద ఉండే పక్షికి. ఆ నౌక తప్పవేరే నీడ లేనట్టు, భవసాగరంలో కొట్టుమిట్టాడే జీవునికి భగవత్పద పంకజాలు తప్ప గత్యంతరం లేదుకాదా! ఈ భావాన్ని తులసీదాసు ఎంత మనోజ్ఞంగా చిత్రించాడో, చూడండి: నీవు తప్ప నాకు ఇంకెవరు దిక్కున్నారయ్యా ? ఓ దీనబంధూ ! ఎవరి దగ్గరకు వెళ్ళి మొరబెట్టుకునేదయ్యా? సేవకులమీద. మిత్రులమీద, దుఃఖితులపట్ల, అనాధులపట్ల నిర్హేతుక జాయమాన కృపాకటాక్షం కలిగిఉండే వారునీవు తప్ప వేరెవరయ్యా? ఎంతోమంది పాపాత్ములు ఎటువంటి సాధనాలు లేకుండా, ఈ భవసాగరాన్ని సునాయాసంగా దాట గలిగారంటే నీవు అనుగ్రహంతోనో. ఆగ్రహంతోనో. నిజంగానో, అబద్ధంగానో, చాటుగానో, సీటుగానో ఒక్కసారి వారివైపు చూసిఉంటావు. అంతే. ఆ చూపు ప్రభావంచే

వారు భవసాగరాన్ని దాటారు. అంతగొప్పది నీ అనుగ్రహ ప్రభావం. కాబట్టి నీ ఇచ్చవచ్చిన విధంగానైనా, నన్నొకసారి చూడవయ్యా స్వామి! తులసీదాసుని నీవాడిగా చేసుకోవయ్యా! ఇంక ఆలస్యం చేయవద్దు. జీవనజ్యోతి కొడిగట్టే సమయం దగ్గరపడుతున్నది. త్వరపడవయ్యా. చేయూతనియ్యి స్వామీ!

*

జానకీదేవి రఘునాథుని ఆహ్లాదినీ శక్తి కనుక ఆమె మాట మాత్రం చేత జీవుడు సచ్చిదానంద పరమాత్మ సాన్నిధ్యాన్ని పొందగలడు. అదీగాక సంతానంపట్ల తల్లికిగల సహజవాత్సల్యం అనుపమానం కదా! అందుచేత తులసీదాసు సీతామ్మ వారిని తనను గురించి ఒక్కమాట ఆ అయ్య చెవిన పడవేయమని ప్రార్థిస్తున్నాడు.

అమ్మా! జానకి! ఒక్కసారి మంచి అవకాశం చూచుకొని, కరుణరసం చిప్పిల్లే ఏదో ఒక కథ చెబుతూ, ఆ తండ్రికి నన్ను గురించి చెప్పవమ్మా! నన్ను గురించి చెబుతున్నప్పుడు, నీ దాసి (తులసి)కి దాసుడయిన ఒక వ్యక్తి, అతిదీనుడు, సర్వసాధన రహితుడు, దుర్బలుడు, మలినుడు, పాపాత్ముడు, కేవలం మీ నామ స్మరణ చేసి పొట్టనింపుకునేవాడు ఒకడున్నాడని చెప్పు తల్లీ! నా పేరు ఆ శ్రీరామ చంద్రుని చెవిన బడితే చాలు, నా దురవస్థ అంతా తొలగి పోగలదు. జానకీ! జగజ్జననీ! ఈ మాత్రం నాకు మాట సహాయం చేశావంటే, ఈ తులసీ దాసుడు జానకీజాని స్మరణ చేస్తూ, సునాయాసంగా భవసాగారాన్ని తరించ గలడమ్మా!

*

నేను ఈ ప్రకారంగా ఎప్పుడైనా జీవించగలనా? సత్పురుషలక్షణాలనుపొందగలనా? అనితన్నుతాను ప్రశ్నించుకుంటూ, తులసీదాసు సజ్జన లక్షణాలను ఈ కీర్తనలో చాలా చక్కగా వర్ణించాడు.

కబహుఁక్ హౌఁ ఇహి రహని రహౌంగో?
శ్రీరఘునాథ కృపాలు కృపాతేఁ సంత్ సుభావ్
గహౌంగో?

శ్రీరఘునాథుని అనుగ్రహంచే సజ్జన స్వభావాన్ని పొంది, ఇంక ముందు ఈ విధంగా జీవించే ప్రయత్నం చేస్తాను ఇహముందు, సత్పురుషులవలె దొరికనదాంతో సంతృప్తి చెంది ఉండగలను. ఎవరి వలన ఏమీ ఆశించను. (ఆశించడం దుఃఖ కారణ మవుతుంది గనుక). మనో, వాక్కాయ కర్మలా నిరంతరం పరోపకారమే చేస్తూ,

మైనియమాన్ని సర్వధా పాటించగలను. కర్ణకఠోరంగానూ, భరించడానికి వీలులేకుండానూ ఉండే పరుల పరుషవాక్కులను వినికూడా దహించుకొపోను. అవమానం కలిగినందువలన ఉద్విగుణ్ని కాను, సన్మానం కావాలనీ కోరుకోను. ఎల్లప్పుడు ఒకే విధంగానూ, ప్రశాంతంగానూ ఉండగలను. ఇతరుల గుణాలను గురించి వక్కాణిస్తాను కాని వారి దోషాలను గురించి పల్లెత్తు మాటకూడా అనను. శరీర బాధలను లక్ష్యపెట్టక, సుఖదుఃఖాలలో సమత్వ బుద్ధి కలిగి ఉండగలను. ఓ ప్రభో! ఈ విధంగా సత్పురుషునివలె బ్రతికి, నిశ్చలమైన భగవద్భక్తిని పొందే సుదినం తులసీదాసుకు ఎప్పుడు ప్రసాదిస్తావు స్వామీ!

మహా రామాయణంలో చెప్పిన రామభక్తుని లక్షణాలు ఇలాంటివే. అందులో ఇలా చెప్పబడి ఉంది.

"శాంతః సమాన మనసశ్చ సుశీలయుక్తః
తోష క్షమాగుణ దయామృజు బుద్ధియుక్తః!
విజ్ఞాన జ్ఞాన విరతిః పరమార్థవేత్తా
నిర్ధామ కోఽ భయమనః సచ రామ భక్తః!!

*

ఓ రామా! నిన్ను కాదని ఎక్కడికి వెళ్ళేదయ్యా? ఈ దీనుడికి నీ చరణాలు తప్ప వేరే దిక్కు ఏది స్వామీ? ఎటువంటి ఆధ్యాత్మిక సాధన సంపత్తిలేని నావంటి అధముడికి, నీచుడికి ఆశ్రయం ప్రసాదించే నీలాంటి దయాసాగరుడు మరొక్కడు ఉన్నాడా? ప్రపంచంలో ధనవంతుణ్ణి, గుణవంతుణ్ణి, చక్కగా సేవలు చేసేవాణ్ణి ప్రభువులు దగ్గరకు తీస్తారు. కాని నాలాంటి దరిద్రుడికీ, మూర్ఖుడికీ, సోమరిపోతుకీ ఆశ్రయం కలిగించడం నీకే తగును. ఇంకా ఏమని విన్నవించేది ప్రభూ! మీరు సర్వాంతర్యాములు. నా సంగతి మీకు తెలియంది కాదు. ఈముల్లోకాల్లో నాకు ఆధారం మీరే, మీరే, మీరే.

*

తనవారు పెట్టే యాతనలను భరించలేక మీరాబాయి తులసీదాసుకు ఉత్తరం వ్రాసిందనీ, దానికి జవాబుగా తులసీదాసు ఈ క్రింది కీర్తన వ్రాసి పంపించాడనీ జనశ్రుతి. ఇది చారిత్రిక సత్యం కాకపోయినా, ఈ కీర్తనలోని యాథార్థ్యం శాశ్వతమైన విలువ కలది.

జాకే ప్రియ న రామ వైదేహీ।
తజియే తాహి కోటి వైరీసమ, జద్యపి పరమసనేహీ ॥
తజ్యో పితా ప్రహలాద్, విభీషన్ బంధు, భరత మహతారీ।
బలి గురు తజ్యో, కంత వ్రజ వనితని, భయేముద మంగలకారీ ॥
నాతే నేహ రామ్‌కే మనియత్ సుహృద్ సుసేవ్య జహాఁ లౌఁ।
అంజన్ కహాఁ. ఆంఖి జెహి ఫూటై, బహుతక్ కహాఁ
కహాఁ లౌఁ ॥
తులసీ సో సబభాంతి పరమహిత్ పూజ్య ప్రాన్‌తే ప్యారో।
జాసో హోయ సనేహ రామపద్, ఏతోమతో హమారో ॥

శ్రీరాముని పట్ల, వైదేహి సీతపట్ల ఎవరికి ప్రేమ లేదో, వారు మనకు ఎంత దగ్గరవారైనా, కోటి శత్రువులుగా భావించి, వదలివేయాలి. అలా చేయడమే పరమ మంగళప్రదం. పూర్వం ప్రహ్లాదుడు తండ్రినీ, విభీషణుడు అన్ననూ, భరతుడు తల్లినీ, బలి గురువైన శుక్రాచార్యునీ, గోపికలు భర్తలనూ వదిలివేసి, పరమానందాన్ని పొందారు కదా! భగవత్ప్రాప్తికి విఘ్నకారులని భావించి, ఇలా స్వజనాన్ని వదలిన ఆ మహనీయులు సర్వదా పూజ్యులయినారు కదా! నామస్మరణ మాత్రాన్నే ఆనం దాన్ని, శుభాన్ని కలిగించే వారైనారు వారు. మనకు మిత్రులుగానివ్వండి, సమ్మాన్యులు గానివ్వండి, ఆయా వ్యక్తులకు పరమాత్మునిపట్ల ఉండే భక్తి భావంచేతనే వారు మనకు మిత్రులూ, ఆదరణీయులూ, అవుతారు. కండ్లుపోయేటంత కాటుక దేనికి? భగవ ద్భక్తికి చేయూతనిచ్చేవారే మనకు నిజంగా మిత్రులూ, పూజ్యులు. ఇంక ఇంతకు మించి ఏం చెప్పేది? కనుక శ్రీరామచంద్రుని చరణారవిందాలపట్ల భక్తికి సహాయకు లయిన వారే మనకు పరమహితైషులూ, పూజ్యులూ, ప్రాణాధికులు. మిగతావారు సర్వదా త్యాజ్యులు. ఇదే నా పరమసిద్ధాంతం.

ఈ జవాబు చూచుకొని, మీరాబాయి తన నగరు వదలి ద్వారకా నగరానికి చేరుకొని చివరివరకు అక్కడే ఉండిపోయిందని చెబుతారు. చారిత్రిక సత్యం కాక పోయినా, ఈ కీర్తనలోని భావం భక్తజనైకవేద్యం కదా!

*

ఇది "వినయపత్రిక"లో చివరి కీర్తన.

శ్రీరామచంద్ర ప్రభువులవారి ఆస్థానం. దర్బారు తీరిఉంది. స్వామి సీతా సహితుడయి సింహాసనంమీద శోభిల్లుతున్నాడు. హనుమంతుడు వారి చరణసేవలో

నిమగ్నుడై ఉన్నాడు. భరత, లక్ష్మణ, శత్రుఘ్నాదులు తమ తమ సేవలో సర్వం మరచి ఉన్నారు. అటువంటి మంచి తరుణంలో తులసీదాసుని 'వినయపత్రిక' (మహజరు) దర్బారులో ప్రవేశ పెట్టబడింది. అప్పుడు సభికుల ఆమోదంతో శ్రీరాముడు ఆ పత్రికమీద తన ఆమోదముద్ర వేయడం ఈ కీర్తనలో రమణీయంగా వర్ణించబడింది.

హనుమంతుడు, భరతుడు "వీరిద్దరి భావాలను గ్రహించి. లక్ష్మణుడు ప్రభువుకు ఇలా విన్నవించుకున్నాడు. 'స్వామీ!' ఈ కలికాలంలో ఒకానొక సేవకుడికి తమ నామంపట్ల ఆసక్తి, తమరిపట్ల విశ్వాసం కుదుదుకున్నవి. లక్ష్మణుడామాట అనగానే సభాసదులంతా అవునవునని తలలూచారు. "అతని సంగతి మాకూతెలుసు. అతనికి మీయందు గల అనన్య సామాన్య అనురాగం లోకవిదితం. ఇదంతా మీ చలవే. మీ కృపాకటాక్ష వీక్షణ ఫలమే. మీరే అతనికి చేయూతనిచ్చారు." అని అన్నారు. అందరి మాటలువిని చిరునవ్వుతో 'అవును నాకూ అతని సంగతి తెలిసింద'. అని ఆ అర్జీమీద ఆమోద ముద్రవేశాడు శ్రీరాముడు. అదిచూచి పులకరించి, తులసీదాసు భగవానుడి ముందు భక్తి పులకితుడై ప్రణమిల్లాడు.

*

## రామచరిత మానసము

'ఆనందకాననే రమ్యే జంగమస్తులసి తరుః
కవితామంజరీ యస్య రామ భ్రమర భూషితా ॥

అని మధుసూదన సరస్వతి నుతించాడు గోస్వామి తులసీదాసుని. తన రచనా చాతుర్య ప్రదర్శనకు కాక, ప్రజా సామాన్యంలో శ్రీరామచంద్రుని ఆదర్శజీవితంపట్ల శ్రద్ధా-భక్తులు కలిగించడానికి, రామచరితమానస మహాకావ్యంలో సత్-అసత్తుల మధ్య జరిగే నిరంతర సంఘర్షణను మనస్సుకు హత్తుకొనిపోయేట్లుగా చిత్రించి, ప్రతి వ్యక్తి తన హృదయంలోని రావణుణి పరిమార్చి, రాముడుగా రూపొందాలనే ఆకాంక్షలో, నాటికీ-నేటికీ అనుసరణీయమైన ఆదర్శమాజానికి - రామరాజ్యానికి - రూపు కల్పించాడు. ఈ మహాకావ్యం తులసీదాసు అప్రమేయ భక్తికి విశ్వశ్రేయో భావనకీ వైజయంతిక. భక్తిపరాకాష్ఠకు. ఆదర్శ ఔన్నత్యానికి ఈ మహాకావ్యం పరమావధి అని చెప్పడంలో ఎటువంటి అతిశయోక్తి లేదు.

రామచరితమానసం వాల్మీకి రామాయణానికి అనువాదం కాదు. రామకథకు సంబంధించిన అనేక రచనలు చదివి, వాటిని జీర్ణించుకొని, ఆ సంస్కారాన్ని తన భక్తి భావనకు అనుకూలంగా మలచుకొని, తులసీదాసు ఈ మహాకావ్యాన్ని రూపొందించాడు. కావ్య ప్రారంభంలోనే ఆయన 'నానా పురాణ నిగమాగమ సమ్మతంగాను' 'స్వాంతః సుఖం' కోసం రఘునాథుని గాథను, ప్రజల భాషలో రచిస్తున్నానని సవినయంగా చెప్పుకున్నాడు. 'శతకోటి ప్రవిస్తరమైన' శ్రీరామ కథను తన వాక్కును పవిత్రపరచుకోవడానికే గానం చేస్తున్నానని చెప్పి, ముందుగా 'మానస' మహాకావ్యాన్ని సాంగరూపకంగా వివరిస్తూ, సప్తకాండలే సప్త సోపానాలని, ఉపమానాలు తరంగాలనీ, చౌపాయీలు పద్మపత్రాలనీ, సరసకవితోక్తులు ఆలిచిప్పలనే, భావాలు పరాగమనీ, అర్థం మకరందమనీ తన కావ్య వైభవాన్ని వ్యంజిస్తాడు.

ఇహపర సాధకమైన రామకథను ఆ మహా భక్తుడు ప్రౌఢ నిర్భర వయః పరిపాక దశలో (77వ సం॥లో) రచించాడు. జ్ఞానం-భక్తి, ఆధ్యాత్మికత - భౌతికత, రాజులు-ప్రజలు, సజ్జనులు-దుర్జనులు మొదలుగాగల గుణదోషమయ ప్రకృతిలో మహత్తరమైన సమన్వయాన్ని సమకూర్చింది ఈ మహాకావ్యం. రాముడు జ్ఞానులకు పరబ్రహ్మ-పరమాత్ముడు. భక్తులకు లీలామానుష విగ్రహుడు. కర్మమార్గానుయాయులకు మార్గప్రదర్శకుడు. దీనులకు దీనబాంధవుడు. పతితులకు పతితపావనుడు. ఈ విధంగా సంఘంలో ప్రతివ్యక్తీ తన అభీష్టాన్ని పొందడానికి వీలుగానూ, పండిత పామరులకు పఠనీయంగానూ ఈ కావ్యరచన జరిగింది.

దోహ-చౌపాయి (అంటే ఒక దోహ తరవాత ఎనిమిది చౌపాయీలు) పద్ధతిలో సాగిన ఈ రచనలో తులసీదాసు అక్కడక్కడా గణబద్ధమై ఉండే వృత్తాలనువాడాడు. ప్రతి కాండకు ప్రారంభంలో సంస్కృత శ్లోకాలు రచించాడు. తనకుగల పాండిత్య ప్రకర్షనూ, బహుగ్రంథ పఠనంచే కలిగిన పాండితీ పాటవాన్ని, అతి సుబోధకంగా, సరస, సరళ మనోహరంగాను రచించి పామరజనులకు కూడా గంభీర విషయాలు కరతలామలకాలు అయ్యేట్లు వివరించాడు.

తులసీదాసు మహాభక్తుడు. శ్రీరామ భక్తియే అతన్ని రచనకు పురికొల్పింది. అందుచేత శ్రీరాముడు వాల్మీకి రామాయణంలోవలెనే ఆదర్శ మానవుడుగాకాక, శిష్టరక్షణార్థమూ, దుష్ట శిక్షణార్థమూ అవతరించిన లీలామానుష విగ్రహునివలె కన్పిస్తాడు. సామాన్య కర్తవ్య ధర్మాలను ఉల్లంఘించి, పెడత్రోవలబడిపోతున్న జన

సామాన్యానికి కొత్త వెలుగు చూపించి, వర్ణాశ్రమ ధర్మనిష్టమూ, వేదవిహితమూ అయిన కర్తవ్య మార్గ ప్రబోధం చేసి, వైషమ్యరహితమయిన రామరాజ్యానికి రూప కల్పన చేశాడు. ఇవే రామచరితమానసానికి అప్రతిమాన జనాదరణ, గౌరవం లభించడానికి కారణాలు.

ప్రజల భాషలో రామాయణ గాథను విరచించినా, తులసీదాసు ప్రతి కాండ ప్రారంభంలోను, సంస్కృతభాషలో దేవీ దేవతాస్తుతి చేశాడు. బాలకాండ ప్రారంభం వాణీ వినాయకుల స్తుతితో ఇలా ప్రారంభమవుతుంది.

వర్ణానామర్థ సంఘానాం రసానాం ఛందసామపి ।
మంగళానాం చ కర్తారౌ వందే వాణీ వినాయకౌ॥

(అక్షరములకు, అర్థ సమూహములకు, రసములకు, ఛందములకు మంగళమొన రించు వాణీవినాయకులనేను నమస్కరించెదను.) ఈ శ్లోకంలో కవితారూపాన్ని, తదుద్దేశ్యాన్ని అతి వ్యంగ్యంగా వివరించాడు. నిజానికి అక్షరాలు, అర్థాలు, రసాలు, ఛందాలు వీటిని సరిగా తీర్చిదిద్దడమే కదా కవితా స్వరూపం. సర్వజన శ్రేయోభావన కలిగిఉండడమే కదా కావ్యోద్దేశ్యం. మానస కావ్యాన్ని పోల్చిచెప్పిన రూపకాలంకారంలో కూడా సరసిజ సౌరభాన్ని భాషతోనూ, పరాగాన్ని భావంతోనూ, అర్థాన్ని మకరందంతోను పోల్చాడు.

అంతేగాక విద్యా వివేక ప్రదాతలయిన వాణీ వినాయకులను స్తుతించడంలో, వివేకభూషితమైన విద్యయే పరమార్థ సాధకమని కూడా భంగ్యంతరంగా చెప్పాడు ఆయన.

అయోధ్యా కాండ ప్రారంభంలో చేసిన ఈ శివస్తుతికూడా చాలా ప్రసిద్ధం.

యస్యాంకే చ విభాతి భూధరసుతా దేవాపగా మస్తకే
భాలే బాలవిధుర్గలే చ గరలం యస్యోరసి వ్యాలరాట్ ।
సోఽయం భూతి విభూషణః సురవరః సర్వాధిపః సర్వదా
శర్వః సర్వగతః శివః శశినిభః శ్రీశంకరః పాతుమామ్ ॥

అంకమునపై విరాజిల్లే పార్వతితోను, శిరస్సున దేవనదితోను, ఫాలభాగమున బాలచంద్రునితోను, కంఠమున గరళముతోను, వక్షస్థలముపై శేషాహితోను సుశోభితుడై, భస్మ విభూషితాంగుడైన దేవశ్రేష్ఠుడు, సర్వేశ్వరుడు, సంహారకర్త, సర్వ

వ్యాపకుడు, కళ్యాణ స్వరూపుడు, చంద్రునిబోలిన ధవళశుభ్రవర్ణుడు అయిన శంకరుడు నన్ను రక్షించుగాక.

## 1

విశ్వామిత్రునితో పాటు మిథిలానగరం చేరుకున్న తరవాత, ఒకరోజు వేకువ జామున రామలక్ష్మణులు పూజకు పుష్పాలకై తోటకు వెళ్ళారు. అదే సమయానికి సీత చెలులతో తోరీపూజకై అదే తోటలోకివచ్చింది. అక్కడ సీతారాములు పరస్పరం ఒకరినొకరు చూచుకుంటారు. ధనుర్భంగానికి ముందే పుష్పవాటికలో ఈ 'పూర్వాను రాగ' చిత్రణ 'ప్రసన్నరాఘవం'లో తప్ప మరెక్కడా లేదు. తులసీదాసు ఈ ప్రసం గాన్ని అతి మనోహరంగా వర్ణించాడు. ఆది దంపతులకు ప్రథమ వీక్షణంలోనే కలిగిన అనురాగాన్ని వర్ణించడంలో తులసీదాసు ఎంతో ఔచిత్యాన్ని పాటించాడు.

దేఖన్ బాగు కుఁవర్ దుయి ఆయే ।
బయకిసోర్ సబబాంతి సుహాయే ॥
స్యామ గౌర్ కిమి కహౌఁ బఖానీ ।
గిరా అనయని నబనబిను బానీ ॥

ఉద్యానవనాన్ని చూట్టానికి వయః కిశోరులు, అన్ని చందాల అందగాళ్ళయిన ఇద్దరు రాజకుమారులు వచ్చారు. ఆ శ్యామల-గౌరవర్ణులు, ఆ రాజకుమారులను ఎలా వర్ణించేది? కన్నులకేమో నాలుకలేదు, నాలుకకేమో కన్నులు లేవు! అని ఒక సఖి మరో సఖితో రామలక్ష్మణుల సౌందర్యం వర్ణనాతీతం అని వ్యంగ్య గర్భితంగా అంటు న్నది. కండ్లు చూచినదాన్ని వర్ణించలేవు. వర్ణించే జిహ్వ చూడలేదు. అనగా జిహ్వకు ప్రత్యక్షజ్ఞానం లేదు కనుక అది ప్రామాణికం కాదు.

సఖుల ద్వారా వారు ఆవశ్యం అవలోకనీయులని విని జనకపుత్రి వారి దర్శ నానికై తహతహలాడుతుంది. అప్పుడు నారదుని వచనాలు స్మృతిపథంలో తళుక్కు మనగా, ఆమె చకిత హరిణేక్షయై అటు ఇటూ చూడసాగింది. ఆ నడల కదలికను ఆమె ధరించిన ఆభరణాలు ధ్వనించినవి.

కంకన కింకిని నూపురధుని సుని ।
కహత్ లఖనసన్ రాము హృదయ గుని ॥
మానహుఁ మదన దుందుభీ దీన్హీ ।
మనసా బిస్వ బిజయ కహఁ కీన్హీ ॥

సీతాదేవి ధరించిన కంకణ-కింకిణి-నూపురాల ధ్వని విని, రాముడు మనస్సులో ఊహించి, లక్ష్మణుడితో ఇలా అన్నాడు. "ఈ మధుర మనోహర ధ్వని విశ్వ విజయానికై మదనుడు నగారా మ్రోగించినట్లుగా ఉన్నది." ఈ సరస భావాన్ని రామచరితమానసాన్ని హిందీ చందస్సులలోనే వ్రాసిన శ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి గారు, మంద నరహరిగారు ఇలా అనువదించారు.

ఘననూపుర కంకణ భూషాధ్వని
విని విభుఁడనె సుగుణుని తమ్మునిఁగని
మనసిజుఁడీ జగమును గెలువంగన్
జననగు భేరిధ్వనియో యనంగన్.[1]

ఇలా అని ఆయన సీతాదేవిని చూడసాగాడు. సీతా ముఖచంద్రునిపట్ల రాముడి నేత్రాలు చకోరాలు అయినవి.

అనిమేషలయ్యెను నయనంబుల్
జనియించెను మదిననురాగంబుల్
జనకజ శోభను గన సుఖమయ్యెన్
మనము మదన శరమథితంబయ్యెన్.

(శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, మంద నరహరిగారి అనువాద వ్రాతప్రతి నుండి)

సీత సౌందర్యాన్ని వర్ణిస్తూ రాముడిలా అనసాగాడు.

'జనుబిరంచి సబనిజ నిపునాఈ। బిరచి బిస్వకహఁ. ప్రగటిదేఖాఈ॥
సుందతా కహుఁ. సుందర్ కరఈ। ఛవిగృహఁ. దీపసిఖాజనుబరఈ॥
సబ్ ఉపమా కవిర హేజుఠారీ। కెహిఁ. పటతరౌఁ. విదేహకుమారీ॥

---

1. రామచరిత మానసానికి ఇది తొలి తెలుగు సేత. శ్రీ ముక్కామల రుక్మేశ్వర శాస్త్రి వ్రాసిన నకలు (copy)ని విజయనగరం మహారాజా వారి గ్రంథాలయం నుండి మాన్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు అకాడమీ తరఫున తెప్పించి, మళ్ళీ తిరగ వ్రాయించారు. ఆం. ప్ర. సాహిత్య అకాడమీ పక్షాన ఈ రచనను ప్రచురించాలని ప్రయత్నాలు జరుగుతున్నవి.

విధాత తన నైపుణ్యాన్ని అంతా కూడకొట్టుకొని. ఈ సౌందర్యరాశిని నిర్మించి ప్రపంచం ముందు సాక్షాత్కరింపచేశాడు. ఆమె అందానికి అందం కలిగించేట్టుగా ఉంది. ఛవి గృహంలో దీపశిఖలా వెలుగుతున్నది. అన్ని ఉపమానాలను కవులు ఈవరకే ఏలుకొన్నారు. (బాదోచ్ఛిష్టం జగత్ సర్వం అనే ఆభాణకం గుర్తుకు వస్తున్నది) విదేహకు మారినవర్ణించడానికి నాకు ఉపమానమే దొరకడంలేదు. ఈ చౌపాయిలో 'విదేహ' శబ్దానికి కొందరు వ్యాఖ్యాతలు వ్యంగగర్భితమైన అర్థం ఉందన్నారు. 'విదేహ' అంటే దేహంలేనిది. దేహమేలేకుంటే దేన్ని వర్ణించేది? కనుక తులసీదాసు ఇక్కడ ఈ శబ్దాన్ని సాభిప్రాయంగా ప్రయోగించాడని చెప్పవచ్చు.

కాళిదాసు 'దీపశిఖ' అంధకారంలో ఉన్న వస్తువును భాస్వంతం చేస్తే, తులసీదాసుని 'దీపశిఖ' శోభామందిరాన్నే శోభాయమానం చేస్తున్నది.

## 2

ఆ నాటి సాయంకాలం సంధ్యావందనం చేయడానికి వెళ్ళిన రామలక్ష్మణులకు తూర్పున ఉదయిస్తున్న చంద్రుడు కనిపించాడు. ఆ చంద్రబింబం సీతా ముఖంలా ఉన్నదని వారు సంతోషించారు. కాని మళ్ళీ ఆలోచించి చూడగా వారికి చంద్రబింబం సీత ముఖంలా లేదనిపించింది. చంద్రుడు జన్మించింది సముద్రంలో. గరళం అతని సహోదరుడు పగటిపూట మలినుడూ. రాత్రి కళంతుడూ. అయిన చంద్రుడు సీత ముఖంతో సరిపోలగలడా! ఇంతేగాక చంద్రుడు పెరుగుతూ తిరుగుతూ ఉంటాడు. విరహిణులకు దుఃఖం కలిగిస్తూ ఉంటాడు. అవకాశం చూచుకొని రాహువు అతని మింగేస్తుంటాడు. చకోరాలకు శోకాని కలిగిస్తాడు. పంకజాలకు శత్రువు. కనుక చంద్రుణ్ణి సీత ముఖంతో ఉపమించడం చాలా అనుచితమని ఇలా కవి వక్కాణిస్తాడు.

... ... ... ... । సీయ బదన సమ్ హిమకర్ నాహీం ॥
జనము సింధు పునిబంధు విషు దిన్ మలీన్ సకలంక్ ।
సియముఖ్ సమతా పావ్ కిమి చందు బాపురో రంక్ ॥
ఘటఇ బఢఇ బిరహిని దుఖదాఈ । గ్రసఇ రాహు నిజ సంధిహిం పాఈ ॥
కోకసోకప్రద్ పంకజ ద్రోహీ। అవగున బహుత్ చంద్రమాతోహీ ॥
వైదేహీముఖపటతర్ దీన్హే । హోఇ దోషు బడ అనుచిత కీన్హే॥
సియముఖ్ ఛవి వ్యాజ్ బఖానీ । గురుపహిం చలే నిసా బడిజానీ ॥

ఈ విధంగా చంద్రుడు నెపంగా సీతాముఖ చంద్రుణ్ణి వర్ణించుకుంటూ, చాలా ఆలస్యమయిందనుకుంటూ, సోదరులిద్దరూ గురువు దగ్గరకు వెళ్ళారు.

చంద్రునిలో దోషాలెత్తి చూపిస్తూ, కవి ఆ దోషాలు సీతలో లేవని, అందుచేత ఆమె ముఖ మండలం చంద్రబింబం కంటే అప్రతిమానమైనదని, ఆమె అనింద్య సౌందర్యాన్ని వర్ణిస్తూనే, చంద్రవర్ణనం చేశాడు. ఇదివ్యాజస్తుతి. చక్కని అర్థాలంకారం.

**3**

గురువు విశ్వామిత్రునికి ప్రణమిల్లి రఘువీరుడు ధనుస్సు ఉంచిన చోటికి వెళ్ళాడు. ఆ సమయంలో ఆ రఘువీరుని చూచి పులకితాంగుడై తులసీదాసు ఈ విధంగా వర్ణించాడు.

ఉదిత ఉదయగిరి మంచ్ పర్ రఘువర్ బాలపతంగ్ ।
బికసే సంత్ సరోజ్ సబ్ హరషె లోచన్ భృంగ్ ॥
నృపన్హ కేరి ఆసా నిసినాసీ। బచననఖత్ అవలీ న ప్రకాసీ ॥
మానీ మహిప్ కుముద్ సకుచానే। కపటీభూప్ ఉలూక్ లుకానే ॥
భయే బిసోక్ కోక్ ముని దేవా। బరిసహిఀ సుమన్ జనావహిఀ సేవా ॥

ఉదయపర్వత రంగస్థలం మీద రఘువీర బాలసూర్యుడు ఉదయించాడు. ఆ సూర్యోదయంతో సుజన-సరసిజాలు వికసించినవి. వారి నేత్ర భ్రమరాలు హర్షోత్ఫుల్లాలయినవి. పరరాజన్యుల ఆశానిశ అంతరించింది. వారి పలుకు చుక్కలు మెరుపులను కోల్పోయినవి. గర్విత రాజన్య కల్హారాలు ముకుళించుకోపోయాయి. కపట మనస్కులయిన భూపతులు గుడ్లగూబలు. ఏమూలనో దాక్కొనడానికి ప్రయత్నించ సాగారు. దేవముని చక్రవాకాల దుఃఖం అంతరించింది. తమ సేవాభావాన్ని సూచిస్తూ దేవతలు పూలు కురిపించారు.

సూర్యోదయమనే సాంగరూపక వర్ణనతో సూర్యోదయం తరవాత ప్రకృతి ప్రఫుల్లతను, ధనుర్యజ్ఞం జరుగుతున్న జనక సభని పోల్చి, ధనుర్భంగంచేసి, మాయామోహాంధకారాలను పారద్రోలడానికి రాముడు ఉద్యుక్తుడైనాడని తులసీదాసు వ్యంగ్య వైభవంతో చెప్పాడు. సాధు జనులను కమలాలతో పోల్చడంలో కూడా ఇంకో విశేషమున్నది. ఇతరుల ఉదయం (వికాసం, ఉన్నతి) చూచి సాధు జనులు- సుజనులు-ప్రసన్నులు కావడం లోక సహజమే కదా !

# 4

ఈ సందర్భంలో రఘురాముడు శివధనుస్సు దగ్గరకు వెళ్ళినపుడు, సీత హృదయం క్షణకాలంపాటు సందేహ సంభ్రమాలలో లీనమైపోయింది.

ప్రభుహి చితఇ పుని చితవ్ మహి రాజత్ లోచనలోల్ ।
ఖేలత్ మనసిజ్ మీన్ జుగ్ జను బిధుమండల్ డోల్ ॥
గిరా అలిని ముఖపంకజ రోకీ । ప్రగట్ న లాజ్ నిసా అవలోకీ ॥
లోచన్ జలు రహ లోచన్ కోనా । జైసే పరమకృపన్ కర్ సోనా ॥
సకుచి వ్యాకులతా బడి జానీ । ధరి ధీరజు ప్రతీతి ఉర్ ఆనీ ॥
తనమన బచన మోర్ పను సాచా । రఘుపతి పదసరోజ్ చితురాచా ॥
తౌ భగవాను సకల ఉర్ బాసీ । కరిహి మోహి రఘువర్ కై దాసీ ॥
జెహి కేం జెహిపర్ సత్యసనేహూ । సో తెహి మిలఇ న కఛు సందేహూ ॥
ప్రభుతన్ చితఇ ప్రేమ తన్ ఠానా । కృపానిధాన్ రామ్ సబుజానా ॥
సియహి బిలోకి తకేఉ ధనుకైసేం । చితవ్ గరురు లఘువ్యాలహి
జైసేం ॥

శ్రీరామచంద్ర ప్రభువునుచూచి మళ్ళీ క్రింది చూపులుచూస్తున్న సీతాదేవి చంచల నేత్రాలు చంద్రబింబ దోలికలో ఊగుతున్న మన్మథద్వయమో అన్నట్లు ఉన్నవి. 'సందేహ దోలామారోప్యతే' (కాదంబరి). ఇక్కడ వ్యంగ్యంగా సీతాదేవి మనస్సులోని సందేహం, చింత వ్యక్తీకరించాడు కవి. ఆమె మోముదమ్మిలోనుంచి పలుకుతుమ్మెదలు లజ్జారనిజ వ్యాపించడంతో వెలుపలికి రాలేకపోతున్నవి. సిగ్గువల్ల ఆమె ఎవరితోను మాటాడ లేక పోతున్నదని ఎంత సుందరంగా చెప్పాడు ! ఆనంద భాష్పాలు, పరమలోభి దగ్గర ఉండే బంగారంవలె బయటపడకుండా, కన్నుల కొలకుల్లోనే ఉండిపోయినవి.

తన మనస్సులోని ఆర్తం మరీ ఎక్కువై పోయిందని ఆమె సంకోచపడి పోయింది. ఏది ఏమైనా ధైర్యం వహించి, శ్రీ రఘునాధుని చరణ సరోజాలలోనే నా చిత్తము అనురక్తమై ఉందనే నా ప్రతిజ్ఞ త్రికరణశుద్ధిగా సత్యమైతే, సర్వాంతర్యామి భగవంతుడు నన్ను రఘువీర చరణదాసిగా చేస్తాడు. 'యద్యత్ కామయ తేత త్తల్లభతే' అని కదా ఆర్యోక్తి. అయితే ఆ అభిలాష త్రికరణశుద్ధికలదిగా ఉంటే, తప్పకుండా సార్థకమవుతుంది. కనుక ఎవరికి ఎవరిపట్ల నిజమైన ప్రేమ ఉంటుందో వారికి వారు తప్పకుండా లభిస్తారు. ఇందులో ఎటువంటి సందేహానికి ఆస్కారం లేదు.

ఇలా అనుకొని సీతమ్మవారు ప్రభువైపు చూచి, ఈ తనువు రామునిదే నని నిశ్చయించుకున్నది. కరుణా నిధానుడు రాముడు ఆమె మనస్సులోని భావాలన్నింటిని గ్రహించాడు. గ్రహించి అటు సీతవైపు చూచాడు, ఇటు ధనస్సును చూచాడు గరుత్మంతుడు నాగశాబకాన్ని చూచినట్లు, ధనుస్సును చూశాడు. (సీతా పరిగ్రహణం తథ్యమని వ్యంజించాడు తులసీదాసు.)

యే యథామాం ప్రపద్యంతే తాంతథైవ భజామ్యహమ్.

**5**

శ్రీరామ పట్టాభిషేక ప్రయత్నాలు జరుగుతుంటే, అయోధ్యావాసులు ఎప్పుడు తెల్లవారుతుందా? ఎప్పుడు మనం ఆ ఉత్సవాల్లో పాల్గొని ధన్యులమవుదామా? అని తహతహ లాడుతుంటే, స్వార్థపరులైన దేవతలు పట్టాభిషేకానికి విఘ్నం వాటిల్లాలని కోరుకుంటున్నారు, చోరులు వెన్నెల రాత్రులను సహించలేనట్లు, వారు అయోధ్యలో జరిగే ఉత్సవాన్ని చూచి సహించలేక పోయారు.

సకల్ కహహిఀ కబ్ హోఇహి కాలీ। బిఘన్ మనావహిఀ
దేవకుచాలి॥
తిన్హహి సోహాఇన అవధ బధావా। చోరహి చందినిరాతి న భావా॥
సారదబోలి బినయ సుర్ కరహీఀ। బారహిఀ బార్ పాయలై
పరహీఀ॥

విపతి హమారి బిలోకి బడి మాతు కరిఅ సోఇ ఆజు।
రాము జాహిఀ బన్ రాజు తజి హోఇ సకల సురకాజు॥
సునిసుర బినయ ఠాఢి పఛితాతీ। భఇఉఀ సరోజ్ బిపిన్ హిమరాతీ॥
దేఖి దేవపుని కహహిఀ నిహోరీ। మాతు తోహి నహిఀ థోరిఉ ఖోరీ॥
బిస్మయ హరష్ రహిత్ రఘురాఊ। తుమ్హ జానహు సబ్
రామ ప్రభాఉ॥
జీవకరమ్ బస్ సుఖ్ దుఖ్ భాగీ। జాఇఅ అవధ దేవహిత్ లాగీ॥
బార్ బార్ గహి చరణ సంకోచీ। చలీ బిచారి బిబుధ్ మతి పోచీ॥
ఊంచ్ నివాసు నీచి కర్ తూతీ। దేఖి న సకహిఀ పరాఇ విభూతీ।
అగిల్ కాజు బిచారి బహోరీ। కరిహహిఀ చాహ్ కుసల్ కవి మోరీ।
హరషి హృదయఀ దసరథ్ పుర్ ఆఈ। జనుగ్రహదసా దుసహ్
దుఖదాఈ॥

నాము మంథరా మందమతి చేరీ కైకఇ కేరి ।
అజస్ పేటారీ తాహి కరి గఈ గిరా మతి ఫేరి॥

ఆ దేవతలు అప్పుడు సరస్వతిని ఆహ్వానించి పునః పునః ప్రణామాలుచేసి ఇలా విన్నవించారు. తల్లీ! మాకు ఓ పెద్ద ఆపద వచ్చిపడింది. ఎలాగైనాసరే, శ్రీరాముడు రాజ్యాన్ని వదలి అడవులకు వెళ్ళేట్టుచెయ్యి. అలా జరిగితేనే దేవతల కార్యం సిద్ధించగలదు. దేవతల ప్రార్ధనవిని సరస్వతి పశ్చాత్తప్తురాలయింది. అయ్యో! అయోధ్యా కమలాకరానికి నేను హేమంత రాత్రిని కావలసి వచ్చిందేః సరస్వతి ఆలోచిస్తూ వెనకంజ వేస్తూంటే, దేవతలు మళ్ళీ ఇలా ప్రార్థించారు. 'అమ్మా! దీనివల్ల నీకు ఎలాంటి దోషమూ అంటదు. రఘునాధుడు హర్షవిషాదాలకు అతీతుడు. శ్రీరాముల వారి ప్రాభావ-ప్రభావాలు నీకు తెలియనివి కాదుగదా! జీవుడు తన పురాకృత కర్మలవల్లనే సుఖదుఃఖాలు పొందుతాడు. కనక దశరధుడు బాధపడతాడని ఆలోచించనక్కరలేదు. దేవతల మేలుకోరి అయోధ్యకు వెళ్ళి పనిచక్కబెట్టుకోరా తల్లీ!' ఇలా దేవతలు మరీ మరీ విన్నవించుకోవడంతో, సరస్వతికి ఇహ తప్ప దనిపించింది. ఈ దేవతల బుద్ధి ఎప్పుడు క్షుద్రమైందే. నివాసం ఉన్నతమైందే కాని చేసేపనులు నీచమైనవి. ఇతరుల ఐశ్వర్యాన్ని చూచి ఓర్వలేరు. కాని ముందు ముందు జరుగనున్న రాక్షససంహార వృత్తాంతాన్ని వర్ణించేందుకు వచోనిపుణులయిన సుకవులు నన్ను మళ్ళీ రాముడి యశోగానం చేయడానికి అభ్యర్థిస్తారు. కనుక ఇప్పుడు కష్టంగా ఉన్నా అప్పుడు నాకది పరమ సుఖప్రదమవుతుంది. కనుక ఇదీ ఒకందుకు మంచిదే. ఇలా అనుకొని సరస్వతి దుర్భరవేదన కలగచేసే గ్రహదశ వచ్చినట్లు అయోధ్యలో ప్రవేశించింది.

అయోధ్యలో కైకకు మంథర అనే మందబుద్ధికల ఒక దాసి ఉంది. దాన్ని అపఖ్యాతి పాలు చేయడానికి దాని మనస్సుని మార్చి వెళ్ళిపోయింది సరస్వతి. తులసీ దాసు కైక-మంథరలు నిర్దోషులే కాదు. కేవలం నిమిత్త మాతులని సూచించాడు. భాసుడు ప్రతిమా నాటకంలో కైకను ఈ విధంగానే చిత్రించాడు.

## 6

మారీచుణ్ణి చంపి వస్తున్న శ్రీరాముడు లక్ష్మణుణ్ణి చూచి చాలా ఆందోళన పడతాడు. ఆశ్రమంలో సీత లేదేమోనంటాడు. తిరావచ్చి చూస్తే సీత ఉండదు.

ఆశ్రమ్ దేఖి జానకీహీనా । భయే బికల్ జస్ ప్రాకృత్ దీనా ॥
హాగుననిఖాని జానకీ సీతా । రూపసీల్ వ్రతనేమ్ పునీతా ॥
లఛిమన్ సముఝాప బహుభాంతీ । పూఛత్ చలేలతా తరుపాంతీ ॥

రూప, శీల, వ్రత, నియమాదులచే పవిత్రురాలైన సీతను గురించి అరణ్యంలో గల తరులతాదులను, పక్షులను, మృగాలను తరచి తరిచి అడుగుతూ,రాముడు విరహ వికలుడై ఇలా అంటాడు.

హే ఖగ్ మృగ్ హే మధుకర శ్రేనీ। తుమ్హ దేఖి సీతామృగనైనీ॥
ఖంజన్ సుక్ కపోత్ మృగమీనా। మధుపనికర్ కోకిలా ప్రవీనా॥
కుందకలీ దాడిమ్ దామినీ। కమల్ సరద్‌ససి అహి భామినీ॥
బరున్‌పాస్ మనోజ్ ధను హంసా। గజ్ కేహరి నిజసునత్ ప్రసంసా।
శ్రీఫల్ కనకకదలి హారషాహీం.। నేకు నసంక్ సకుచమనమాహీం।
సును జానకీ తోహీ బిను ఆజూ। హరషే సకల పాఇ జనురాజూ।
కిమి సహి జాత్ అనఖ తోహిపాహీం.। ప్రియా బేగి ప్రగటసి కస్ నాహీం॥

ఎహి బిధి ఖోజత్ బిలపత్‌స్వామీ। మనహు మహాబిరహీ అతికామీ॥
పూరన్‌కామ్ రామ్ సుఖరాసీ। మనుజచరిత కర్ అజ్ అవినాసీ॥

ఓ పక్షుల్లారా ! ఓ మృగాల్లారా ! ఓ మధుకరపంక్తుల్లారా ! మీరు హరిణేక్షణ సీతను చూచారా ? అని సీతకు ప్రియమయిన పక్షులను, వృక్షాలను అడుగుతున్నాడు రాముడు. హనుమన్నాటకంలో రాముడు 'ఇత్యేవం ప్రతిపాదపం,ప్రతినగం', ప్రత్యాపగం, ప్రత్యగం, ప్రత్యేణం. ప్రతి బర్హిణం తన ఇపస్తాం మైథిలీం యాచతే" ప్రతి వృక్షాన్ని, ప్రతి పర్వతాన్ని, ప్రతినదిని, ప్రతిపాషాణాన్ని, ప్రతి మృగాన్ని (లేడిని) ప్రతి నెమలిని అడిగాడట. వాటిల్లో సీత శరీరావయవాల సాదృశ్యం చూచి ఉద్భ్రాంతుడయ్యాడట.

సీత లేదు కదా అని ఇప్పుడు కాటుక పిట్టలు, రాచిలుకలు, పావురాలు' లేళ్ళు, చేపలు, తుమ్మెదల సమూహం, కోకిల, మల్లెమొగ్గ, దానిమ్మ, మెరుపుతీగె, శరత్కమలం, చంద్రుడు, నాగిని, వరుణపాశం, మన్మథచాపం, గుర్రం, సింధురం సింహం-ఇవన్నీ తమ పొగడ్తలు వింటూన్నవి. బిల్వఫలము, సువర్ణము, కదళీ-ఇవి ఏ మాత్రం సందేహం, సంకోచం లేకుండా ఎంతో ఆనందిస్తున్నవి. ఎందుకంటే ఇన్ని రోజుల బట్టి పై ఉపమాన పదార్థాలన్ని సీతతో సరిపోల్చడానికి పనికిరావని తిరస్కృతాలయినవి. సీతా సౌందర్యం వాటిని చూడనివ్వ లేదు. ఈనాడు వాటిని చూడగానే సీత గుర్తుకు రావడంతో రాముడు వాటిని కామార్తుడై అడుగుతున్నాడు.

ఇతఃపూర్వం జగన్మాత సీత సౌందర్య వర్ణన చేయడానికి ఉపమానాలు దొరకలేదన్న తులసీదాసు ఈ ఘట్టంలో నఖశిఖ పర్యంతం పూర్వ కవుల పరిపాటిని అనుసరించి ఉపమానాలను ఏకరువు పెడుతున్నాడు. కాటుకపిట్టల, వేళ్ళను, చేపలను కన్నులతోనూ, రాచిలుకను నాసికతోనూ, పావురాన్ని కంఠంతోనూ, తుమ్మెద పంక్తులను కురులతోనూ, కోకిలను మధుర స్వరంతోనూ, మల్లెమొగ్గలను, దానిమ్మ గింజలను దంతపంక్తులతోనూ, మెరుపుతీగెను మందహాసంతోనూ, శరత్కమలాన్ని, చంద్రుణ్ణి ముఖబింబంతోనూ, నాగినిని వేణితోనూ, వరుణపాశాన్ని కంఠరేఖలతోనూ, మన్మథచాపాన్ని భ్రూలతలతోనూ, హంసలను, గజాలను నడకలతోనూ, సింహాన్ని నడుముతోనూ, బిల్వ ఫలాలను పయోధరాలతోనూ, సువర్ణాన్ని శరీరకాంతితోనూ, అరటికంబాలను తొడలతోను పోల్చడం పరిపాటి.

ఇప్పుడు సీత లేకపోవడంతో పై ఉపమాన్నాలన్నింటికి స్వేచ్ఛ లభించి నట్లయింది. హనుమన్నాటకంలో "వక్త్రం వనాంతే సరసీరుహాణి భృంగాక్షమాలా జగృహర్జుపాయ" (నీముఖాన్ని చూచి సిగ్గుపడి. సరసిరుహం నీళ్ళల్లో ప్రవేశించి భృంగజపమాలను గ్రహించి జపంచేస్తూ కూర్చున్నదట. తులసీదాసు ఇంత విపులంగా కాక రూపకాతిశయోక్తి అలంకారంద్వారా సీత సౌందర్యాన్ని వ్యంజించాడు.)

ఈ ఉపమాలన్ని ఈ విధంగా స్వచ్ఛందంగా విహరిస్తుంటే, నీవు ఎందుకు వెంటనే కనబడి, వాటి గర్వాన్ని అణచివేయవు.

ఇలా చరా చర జగత్తుకు ప్రభువైన ఆ స్వామి మహా విరహాతురుడూ, మహాలంపటుడూ వలె విలపించసాగాడు. పూర్ణకాముడూ, సుఖరాశీ అజుడు, అవినాశీ అయిన రాముడు ఈ విధంగా సామాన్య మానవుడిలా ప్రవర్తిస్తున్నాడని తులసీదాసు వర్ణించాడు.

సబరీ దేఖి రామ్‌గృహఆయే ।మునికే బచన్ సముఝి జియఁభాయే॥
సరసిజలోచన్ బాహు బిసాలా । జటాముకుట్ సిర్ ఉర్ బనమాలా॥
స్యామ్ గౌర్ సుందర దోఉభాఈ । సబరీ పరీ చరన్ లపటాఈ ॥
ప్రేమమగన్ ముఖ బచన్ నఆవా । పునిపుని పదసరోజ్ సిర్ నావా ॥
సాదర్ జల్ లై చరన్ పఖారే । పునిసుందర్ ఆసన్ బైఠారే ॥

కందమూల ఫల్ సురస్ అతిదియే రామ్ కహుఁ. ఆని ।
ప్రేమ సహిత్ ప్రభుఖాయే బారంబార్ బఖాని ॥

పాని జోరిఆగే౯. చఇతాడీ । ప్రభుహి బిలోకి ప్రీతి అతిబాధి ॥
కెహిబిధిఅస్తుతికారౌ౯. తుమ్హారీ । అధమ్ జాతిమైం. జడమతి భారీ॥
అధమ్‌తే అధమ్ అధమ్ అతినారీ । తిన్హమహం. మైం. మతిమంద్ అఘారీ ॥
కహ రఘుపతి సునుభామిని బాతా। మానఉం ఏక్ భగతికర్ నాతా ॥

తన నివాసానికి స్వయంగా రాముడు రావడం చూచి, మౌని వచనాలను స్మరించుకొని, శబరి సంతోషించింది. రాజీవలోచనులూ, విశాల భుజస్కంధాలు కలవారూ, శిరస్సున జటామకుటాలు వక్షస్థలాలపై వనమాలలు ధరించినవారూ ఆ శ్యామల-గౌరవర్ణులు ఆ ఇద్దరు సహోదరులను చూచి వారి చరణాలకు చుట్టుకొ పోయింది శబరి. ప్రేమ పయోధిలో మునకలు వేస్తున్న ఆ శబరికి నోట మాట రాలేదు. వారి చరణ కమలాలని కండ్లకు అద్దుకుంటూనే ఉండిపోయింది. తరవాత వారి చరణాలు కడిగి, చక్కటి ఆసనాల మీద కూర్చోబెట్టింది.

అత్యంత సరసములూ, సుమధురములూ, అయిన ఫలాలను వారికి సమర్పించింది. మాటిమాటికి వాటిని పొగుడుతూ, ప్రభువు ఎంతో ఆనందంగా వాటిని తిన్నాడు.

"కృతారామేణ భక్తానాం శబరీ కబరీమణిః (పద్మపురాణం) అలా ఆయన తన భక్తుల్లో శబరిని శిరోమణి చేశాడు".

ఫలాహారం తరవాత చేతులు కట్టుకొని వారి ముందు నిలబడింది శబరి. భక్తి భావం పెల్లుబుకుతుండ నేను ఎలా మిమ్ములను నుతించేది? అధమ జాతికి చెందిన దాన్ని, మందబుద్ధిని నేను అధమాధముల్లోకి అధమురాలిని. నీవు అఘారివి పాపాలను నాశనం చేసేవాడివి.

ఆమె మాటలు విని రాముడు నేను కేవలం భక్తి భావంచేత ప్రసన్నుణ్ణయ్యే వాణ్ణి కులమూ, ధర్మమూ. గౌరవమూ, ధనమూ, బలము, బలగమూ, చాతుర్యమూ అన్ని ఉండి, భక్తి హీనుడయిన మానవుడు నిర్జలమేఘం లాంటివాడు.

అటు తరువాత రాముడి నోట తులసీదాసు నవవిధ భక్తులను అతి సరళ విధానంలో వివరిస్తాడు.

నవవిధాల భక్తిలో మొదటిది సజ్జన సాంగత్యం. రెండవది భగవత్కథలలో అనురక్తి. మూడవది గురుచరణ సేవ. నాల్గవది నిష్కపట భావంతో భగవద్గుణ సంకీర్తనం. ఐదవది నామస్మరణమూ దానిపట్ల దృఢ విశ్వాసం. ఆరవది ఇంద్రియ నిగ్రహమూ, వైరాగ్యమూ, ధర్మాచరణమూ. ఏడవది సమస్త చరాచర ప్రపంచాన్ని రామమయంగా భావించి, భక్తులను భగవంతుడికంటే మిన్నగా భావించడం. ఎనిమిదవది దొరికనదాంతో సంతృప్తిపడి, కలలోకూడా పరుల అవగుణాలను గురించి ఆలోచించకుండా ఉండడం. తొమ్మిదవది నిష్కపట భావం కలిగి, మనస్సులో భగవద్భక్తితో, సుఖదుఃఖాలకు అతీతులై ఉండడం. ఈ విధమైన భక్తి భావం కలిగి ఉన్నవాడే నాకు పరమప్రియుడని రాముడు శబరికి వివరిస్తాడు.

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యం ఆత్మనివేదనమ్॥

అనే నవధాభక్తికి, శబరికి వివరించిన నవవిధ భక్తికి తేడా ఉన్నది. తులసీదాసు దృష్టిలో భక్తి కేవలం ఒక భావమేకాదు, పూజా విధానం అంతకంటేసూ కాదు. జీవితమే భక్తి. త్రికరణాలూ భక్తి ప్రేరితాలయి ఉండగలిగినపుడే జీవితం ధన్యం అవుతుంది. శబరి జీవితమన్నా భక్తి అన్నా ఒక్కటే అని తులసీదాసు వివరిస్తున్నాడు. రామునితో చెప్పించాడు.

కిష్కింధాకాండలో ప్రకృతివర్ణన నెపంతో తులసీదాసు మానవ స్వభావంలోని వివిధ ప్రవృత్తులను కవితాత్మకంగా వివరించాడు. అతని కావ్య కళా చాతుర్యానికి ఈ ఘట్టం ఒక చక్కని ఉదాహృతి.

లఛిమన్ దేఖు మోర్ గన్ నాచత్ బారిద్ పేఖి ।
గృహీ బిరతి రత్ హర్ష జస్ బిష్ను భగత్ కహాఁ దేఖి ॥
ఘనఘమండ్ నభగరజత్ ఘోరా। ప్రియాహీన్ డరపత్ మన్ మోరా॥
దామిని దమక్ రహ న ఘనమాహీఁ। ఖల్ కై ప్రీతిజథాథిర్ నాహీఁ॥
బరషిహిఁ జలద్ భూమిని అరాయేఁ। జథానవహిఁ బుధ్ బిద్యా పాయేఁ॥
బూంద్ అఘాత్ సహహిఁ గిరికై సేఁ। ఖల్ కేబచన్ సంత్ సహాజైసేఁ॥
ఛుద్రనదీ భరి చలి తోరాఈ। జస్ థోరేహుఁ ధన్ ఖల్ ఇతరాఈ॥

భూమి పరత్ భాఢాబర్ పానీ। జనుజీవహి మాయా లప్టానీ॥
సమిటి సమిటి జల భరహిఁ తలావా। జమి సద్గున్ సజ్జన పహిఁ ఆవా॥
సరితా జల్ జలనిధి మహుఁ జాఈ। హో ఇ అచల్ జిమి జీవ హరిపాఈ॥

హరిత్ భూమి తృన్ సంకుల్ సముఝి పరహిఁ నహిఁ పంథ్।
జమి పాఖండ్ బాద్ తేఁ గు ప్తహోహిఁ సద్‌గ్రంథ్॥

లక్ష్మణా! ప్రాపంచిక విషయాల్లో ఆసక్తిలేని గృహస్థుడు విష్ణుభక్తుణ్ణి చూచి పులకరించినట్లు, మేఘాలను చూచి మయూరాలు ఎలా నృత్యం చేస్తున్నవో చూడు.

ఈ దోహ భారతంలోని
మేఘాగమోత్సవా హృష్టాః ప్రత్యనందన్ శిఖండినః।
గృహేషు తప్తా నిర్విణ్ణా యథాచ్యుత జనాగమే॥
అన్న శ్లోకాన్ని తలపింపచేస్తున్నది.

ఆకాశంలో మేఘాలు ఘోరంగా గర్జిస్తున్నవి. ప్రియాహీనమై నా మనస్సు భయాకులమవుతున్నది.

ఇక్కడనుండి తులసీదాసు ప్రకృతికే మానవుని మనఃప్రకృతికి సామ్యాల నెన్నింటినో ప్రదర్శిస్తాడు.

ఖలుని ప్రేమ తాత్కాలికమైనట్లు, ఆకాశంలో మెరుస్తున్న తటిల్లతలు త్రుటి కాలంలో మాయమవుతున్నవి. స్థిరంగా ఉండడం లేదు.

విద్యావంతులైన బుధజనులు వినయ సంపన్నులై ఉన్నట్లు, జలభరితాలయి మేఘాలు క్రిందికి దిగి వర్షిస్తున్నవి.

దుష్టుల దుఃసహవచనాలను సాధుపురుషులు అవికలులై సహించినట్లు, పర్వతాలు వర్షాఘాతానికి తట్టుకొని నిర్వికారంగా ఉన్నవి.

కొద్దిపాటి ధనసంపత్తులు లభించగానే నీచమనస్కులు గర్వితులయినట్లు కొద్దిపాటి వర్షానికే చిన్న చిన్న నదులు గట్లు తెంచుకొని ప్రవహిస్తున్నవి.

మాతృగర్భంనుండి బయటపడగానే జీవుడు మాయావశుడైనట్లు వర్ష జలం భూమిమీద పడగానే, మలినమయిపోతున్నది.

నలువైపులనుంచి సద్గుణాలు సజ్జనుణ్ణి ఆశ్రయించినట్లు, నాలుగు వైపులనుంచి నీరు తటాకాలకు చేరుకుంటున్నది.

జీవుడు హరిని చేరి నిశ్చలస్థితిని పొందినట్లు, జన్మ మరణ రాహిత్యాన్ని పొంది నట్లుగా, నదులు సముద్రాన్ని చేరి ప్రవాహగుణాన్ని పోగొట్టుకుంటున్నవి.

మూర్ఖుల వాద వివాదాలచే సద్గ్రంథాల్లోని తత్త్వం కప్పబడిపోయినట్లు, భూమి హరిత తృణ సంకులం కావడంతో, మార్గం కనపడడం లేదు. మహాభారతంలో 'పాఖండి నామ సద్వాదైర్వేద మార్గాః కలౌయథా' అని చెప్పిన భావాన్ని తులసీదాసు ఎంత రమణీయంగా చెప్పాడో చూడండి.

ఈ విధంగా కిష్కింధాకాండలో వర్షా-శరదృతువులను వర్ణించే మిషతో తులసీ దాసు మానవప్రవృత్తులను, సుజన-దుర్జన స్వభావాలను చక్కగా, హృదయానికి హత్తుకొనిపోయేట్లు వర్ణించాడు.

తులసీదాసు ఉత్తర కాండలో సీతా వనవాసం లవకుశుల జననం మొదలైన అంశాలను వివరించలేదు. రామ తత్త్వాన్నీ, ఆదర్శ పరిపాలనా విధానాన్నీ, రామ రాజ్యాన్ని దుర్జన-సుజన స్వభావాదులనీ వర్ణించాడు. కాకభుశుండీ - గరుత్మంతుల సంవాదం ద్వారా జ్ఞానం-భక్తి, నిర్గుణ-సగుణతత్త్వాలు, నామ సంకీర్తనఫలం మొదలైన ఆధ్యాత్మిక విషయాలను ప్రశ్నలూ-జవాబులూ రూపంగా వివరించాడు. తులసీదాసుని ఆధ్యాత్మికచింతనాపక్షానికి ఉత్తరకాండ కరదీపిక.

రాముడు అయోధ్యకు తిరిగివచ్చి పట్టాభిషిక్తుడైనాడు. ముల్లోకాల్లో రామరాజ్య ప్రభావం కనిపించసాగింది. 'యథారాజా తథాప్రజా' అన్నట్లు రాముని ఆదర్శజీవన సిద్ధాంతాలు ప్రజాజీవితంలో కూడా ప్రతిఫలించసాగాయి. ఉత్తరకాండలో ఈ సంద ర్భంలో తులసీదాసు ఆదర్శ సమ సమాజానికి కండ్లకు కట్టేట్లుగా చిత్రించాడు.

రామరాజ్ బైఠే( త్రైలోకా। హర్షిత్ భయేగయే సబ్ సోకా ॥
బయరునకర్ కాహూసన్ కోఈ। రామ ప్రతాప విషమతా ఖోఈ॥
బరనాశ్రమ్ నిజనిజ ధరమ్ నిరత్ వేదపథ్ లోగ్ ।
చలహిం సదా పావహిం సుఖహి నహిం భయసోక్ నరోగ్ ॥

దైహిక్ దైవిక్ భౌతిక్ తాపా । రామరాజ్ నహిం కాహుహి
వ్యాపా ॥
సబ్ నర్ కరహిం పరస్పర ప్రీతీ । చలహిం స్వధర్మనిరత్ శ్రుతినీతీ ॥
చారిఉ చరన్ ధర్మ జగమాహీం। పూరిరహా సపనేహుం అఘనాహీం॥
రామభగతి రతనర అరుణారీ । సకల్ పరమగతికే అధికారీ ॥
అల్పమృత్యు నహిం కవనిఉ పీరా । సబ్ సుందర్ సబ్ బిరుజసరీరా॥
నహిం. దరిద్రకోఉ దుఖినన్ నా । నహిం కోఉ అబుధ్ న లచ్ఛన్
హీనా ॥
సబ్ నిర్ధంభ ధర్మరత్ పునీ। నర్ అరునారి చతుర్ సబ్ గునీ ॥
సబ్ గునగ్య పండిత్ సబ్ గ్యానీ। సబ్ కృతగ్య నహిం. కపట్
సయానీ ॥

రామరాజ్యంలో అందరూ సుఖంగాను, విగత శోకులై జీవించసాగారు. ఆ రాజ్యంలో ఎవరికీ ఎవరిపట్ల వైరభావం లేదు. రాముని ప్రభావంచే వైషమ్యం తొలగి పోయి, సమత్వం స్థిరపడింది. అందరూ వర్ణాశ్రమ ధర్మానికి అనుకూలంగా తమ తమ కర్తవ్యాలు నిర్వహిస్తూ, వేదమార్గాన్ని అనుసరిస్తూ, సుఖంగా జీవితం గడపసాగారు. ఎవ్వరికీ ఎటువంటి భయశోకాలూ లేవు. రోగాలు లేవు; 'ధర్మోరక్షతి, రక్షితః' అన్న ఆర్యోక్తి ప్రకారం ప్రజలు ధర్మానుసారంగా ప్రవర్తిస్తున్నారు కాబట్టి, ఆ ధర్మం వారిని రక్షిస్తున్నది రామరాజ్యంలో ఎవరిని తాపత్రయాలు బాధించవు. కలిసిమెలిసి మెలగుతూ, వేదోక్త నీతి మార్గాన్ననుసరించి, ప్రవర్తిస్తూ అందరూ సుఖంగా ఉంటున్నారు. ధర్మదేవత నాలుగు చరణాలతో చక్కగా సంచరిస్తున్నది. ధర్మదేవతకు సత్యం, శౌచం, దయ, దానం అనేవి నాలుగు పాదాలు (సత్యం, శౌచం. దయా, దాన మితి పాదాః ప్రకీర్తితాః అని మనుస్మృతి, కాని మహాభారతంలో దానానికి బదులు తపమని చెప్పబడ్డది. కలియుగంలో గర్వమూ, ఆసక్తీ, మదమూ అనే దుర్గుణాలవల్ల మూడు పాదాలు నశించిపోయినవి.) రామరాజ్యంలో జనులు సత్య వాక్పరిపాలురూ, శౌచపరులూ, దాన దయాగుణరతులై ఉండేవారన్నమాట. ఆ కాలంలో ధర్మాన్ని నశింపచేసే ఏ పాపమూ ఫలించేది కాదు. స్వప్నంలోకూడా ప్రజలు పాపాన్ని తలపెట్టే వారు కారు. రామభక్తిరతులై సమస్త ప్రజలు మోక్ష పద ప్రాప్తికి అర్హులై ఉండే వారు. తులసీదాసు చెప్పిన రామభక్తి సమస్త సద్గుణోపేతము కదా! అకాలమరణం

లేదు. అందరూ సుందరాకారులు. ఆరోగ్యవంతులు. దరిద్రుడూ, దుఃఖపీడితుడూ, దీనుడూ లేనేలేడు. బుద్ధిహీనుడూ, లక్షణ హీనుడూ ఎప్పుడూ లేనే లేడు. దంభ రహితులూ, ధర్మవతులూ, దయాళువులూ అయి సర్వజనులు గుణవంతులు, గుణజ్ఞులు, పండితులు, జ్ఞానవంతులు, కృతజ్ఞులు, కపటరహితులు అయి ఉండేవారు.

ఇలా ఆదర్శ సమాజాన్ని వర్ణించి, ఆ తరవాత తులసీదాసు సుజన - దుర్జన స్వభావ ప్రకృతులను విపులంగా, విశదంగా వర్ణించాడు. సమసమాజ నిర్మాణానికి తులసీదాసు వర్ణించిన మార్గం రాచబాట. అందుచేతనే రామరాజ్యస్థాపనకై కలలుగన్న జాతిపిత గాంధీగారు రామచరితమానసాన్ని అత్యంత పవిత్ర గ్రంథంగా భావించారు. సకల జనులు ఈ గ్రంథాన్ని పారాయణ చేయాలని పదే పదే చెప్పేవారు.

కాంమిహి నారిపి ఆరిజిమి లోభిహి ప్రియ జిమిదామ్ ।
తిమి రఘునాథ నిరంతర ప్రియలాగవహు మోహీ రామ్ ॥

కామి స్త్రీని విడిచి ఉండలేడు. లోభి ధనాన్ని విడిచి ఉండలేడు. రామా! నేనూ నిన్ను విడిచి ఉండలేను. నీ సాన్నిధ్యం నాకు నిరంతరం అభిలషణీయం.

తులసీదాసు వ్యక్తిత్వం, అతని జీవితంలోని ఒక ఘట్టం ఇక్కడ వ్యంజిస్తు స్తున్నాడు. తనను రామాయణ రచనకు ప్రేరేపించిన ఘట్టాన్ని మరోతీరుగా చెబుతు న్నాడు. తులసీదాసు చిన్నతనంలోనే వేదవేదాంగాలను, సంస్కృత భాషా సాహిత్యా లను క్షుణ్ణంగా అధ్యయనంచేశాడు. మంచి పాండిత్యం సంపాదించాడు. చక్కనివాడు, చక్కని చుక్క రత్నావళిని పెండ్లాడాడు. బమ్మెరపోతన తలపోసినట్లు,

హాలాపాన విజృంభమాణ మదగర్వారూఢ దేహోల్ల స
ద్బాలా లోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముండై లేశమున్
వేలా నిస్సరణంబు గానక మహావిద్వాంసుడున్ గామినీ
హేలాకల్పిత కురంగ శాబకమగున్ హీనస్థితిన్ వింటిరే.

తులసీదాసులౌల్యంలో అంతా మరచిపోయాడు. కామంతో కన్నులు మూసు కొనిపోయినవి భార్యా విరహాన్ని క్షణంకూడా సహించలేని దుఃస్థితికి దిగజారాడు.

బావమరది అతనికి తెలియకుండా ఆమెను పుట్టింటికి తీసుకొనిపోతే వరదల్లో ఉన్న గంగను ఈది, అడ్డమరేయి గోడదూకి, అత్తవారింటనున్న భార్యముందు వ్రాలాడు. రత్నావళి సుగుణరత్నావళి. తనపట్ల భర్తకున్న మమతకు మనస్సు పులకరించింది.

కాని అంతప్రాజ్ఞుడైన తనభర్త వ్యవహారం, నలుగురిలో నగుబాటుకావడం సహించలేక పోయింది. తనమీదఉన్న ప్రేమలో సగభాగమైనా ఆ రఘురామునిపట్లఉంటే, జన్మ తరిచందా ? అన్నది. తులసీదాసు ప్రతిభ మేల్కొన్నది. గ్రహణంనుంచి విడివడ్డ సూర్యబింబంలా కాంతిని సంతరించుకున్నాడు. జీవితాన్నే శ్రీరామార్పితం చేశాడు. చరితార్థుడయ్యాడు. 'రామచరితమానస్' ప్రపంచానికందించాడు. అందుకే అన్నాడు కామి స్త్రీని విడిచి ఉండలేనట్లు, రాముణ్ణి పిడిచి తానుండలేనని తన అనుభవాన్ని రంగరించి వ్యంగ్యంగా చెప్పాడు. ఆ ఉదంతంతో తనకెంత సంబంధం ఉందంటే ఈదోహాను 'మానస్' చివరకు వ్రాశాడు. 'మానస్' ముగిసిన తరవాత అతన్ని ప్రేరేచిన ఆ ఘట్టం స్మృతిపథంలో తళుక్కుమందేమో ! అచ్చమైన కవి కాబట్టి విప్పి చెప్పక కప్పి చెప్పాడు. ఈ దోహా చివరికే ఎందుకుండాలి ? అని ఎంత కాలంగానో ఆలోచిస్తున్నాను. కాని యువభారతివారి అనునయంవల్ల మళ్ళీ 'మానస్' తిరుగవేశాను. నా సందేహాన్ని ఈ దోహాలోని అంతరార్థం దూరం చేసింది. తులసీ దాసు సాహిత్యానికి నన్ను మరీ సన్నిహితుణ్ణి చేసింది. తులసీదాసు సాహిత్య వ్యక్తి త్వాలను గూర్చి తెలుసుకోవలసిన అవసరం అతిమాత్రంగా ఉన్నది. నా యీ ప్రయత్నం సమగ్రమైంది కాదనీ, నిర్దుష్టమైంది కాదనీ నాకు తెలుసు. విజ్ఞులు కృషిని కొనసాగిస్తారని ఆశిస్తున్నాను.

## రామాయణ ఫలశ్రుతి

పుణ్యం పాపహరం సదా శివకరం విజ్ఞాన భక్తిప్రదమ్
మాయా మోహమలాపహం సువిమలం ప్రేమాంబుపూరం శుభమ్।
శ్రీమద్రామ చరిత్ర మానసమిదం భక్త్యావగాహంతి యే
తే సంసార పతంగ ఘోర కిరణైర్దహ్యంతి నో మానవాః ॥




## సాహితివాహినిలో ఇంతవరకు వెలువడిన తరంగాలు

1. మందార మకరందాలు రు. 2-00
2. వేమన్న వేదం ,,
3. భోగినీలాస్యం ,,
4. వడగళ్ళు ,,
5. నా గొడవ ,,
6. శ్రీనాథుని కవితావైభవం ,,
7. విశ్వనాథ కవితావైభవం ,,
8. సిందూరం ,,
9. శిఖరాలు-లోయలు ,,
10. భావన ,,
11. మెరుపులు ,,
12. తిక్కన కవితావైభవం ,,
13. చేమకూర కవితావైభవం ,,
14. చలం ఆలోచనలు ,,
15. భారతీ వైభవం ,,
16. తిమ్మన కవితావైభవం ,,
17. ధూర్జటి కవితావైభవం ,,
18. తులసీదాసు కవితావైభవం ,,
19. నన్నయ కవితావైభవం ,,

**యువభారతి**
**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3**

FOR SUNRAY: COVER PRINTED AT
NAGA LAKSHMI ART PRINTERS. HYDERABAD • 500 029